శ్రీరస్తు

# కుమారీశతకము.

(పక్కి వేంకటనరసింహకవి ప్రణీతము.)

బాలకళానిధి ప్రణీతమైన

టీకాతాత్పర్యసహితము.

ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

---

రాజమహేంద్రవరము:

శ్రీసత్యానందప్రెస్సునందు

ముద్రింపబడినది.

1932

 [వెల 3 అణాలు.

# మైలవరం కంపెనీ వారిచే ప్రదర్శింపబడు నాటకములు.

| నాటకము | రు | అ |
|---|---|---|
| కనకతార చం. క. | రు 1 | 4 |
| హరిచంద్రీయము బ. ల. | 1 | 0 |
| శ్రీకృష్ణతులాభారము ము. సు. | 1 | 0 |
| కృష్ణలీల బళ్ళారి వం. క. | 1 | 4 |
| కుశలవ డిటో | 1 | 4 |
| రంగూన్‌రౌడీ సో. రా. | 1 | 0 |
| వేణీసంహారము ష. సు. | 1 | 0 |
| సాత్రాజితీయము బ. ల. | 1 | 0 |
| ఉత్తరరాఘవం కుశలవ | 1 | 4 |
| రామదాసు బళ్ళారి డి. రా. | 1 | 0 |
| బొబ్బిలియుద్ధం శ్రీ. కృ. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకము పా. ల. న. | 1 | 4 |
| విప్రనారాయణ డిటో | 1 | 0 |
| శారంగధర డిటో | 0 | 8 |
| రాధాకృష్ణ డిటో | 0 | 12 |
| చూడామణి డిటో | 0 | 12 |
| రోషనార కో. సు. | 1 | 0 |
| గయోపాఖ్యానం చి. ల. | 0 | 8 |
| ప్రసన్నయాదవము డిటో | 0 | 8 |
| పారిజాతాపహరణం ,, | 0 | 8 |
| చతురచ్చంద్రహాస ,, | 0 | 8 |

| నాటకము | రు | అ |
|---|---|---|
| చింతామణి కా. నా. | 1 | 0 |
| వరవిక్రయం డిటో | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పద్మవ్యూహం. డిటో | 1 | 0 |
| పాండవవిజయం తి. వెం. క. | 1 | 0 |
| పాండవవుద్యోగము అను శ్రీకృష్ణరాయబారము డిటో | 1 | 0 |
| పాండవఅశ్వమేధం డిటో | 1 | 0 |
| మైలవరపు సావిత్రి శ్రీ. స. | 1 | 0 |
| మైలవరముద్రౌపది మ. అ. | 1 | 0 |
| మైలవరముఅనసూయ సో. రా. | 1 | 0 |
| రసపుత్రవిజయము యి. య. వా. | 1 | 0 |
| జయంతజయపాల ఆ. స. | 0 | 12 |
| కన్యాశుల్కము గు. అ. | 1 | 0 |
| శాకుంతలం కం. వీ. | 0 | 12 |
| ధరణికోట సో. రా. | 1 | 4 |
| చండిక ము. వెం. చె. కీ. | 1 | 0 |
| చిత్రనళీయం బ. డి. కృ. | 1 | 4 |
| విషాదసారంగధర డిటో | 1 | 4 |
| ప్రహ్లాద బ. డి. కృ. | 1 | 0 |
| ప్రమీలార్జునీయము డిటో | 1 | 0 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి.

శ్రీ ర స్తు

# కుమారీశతకము

(పక్కి వేంకటనరసింహాకవి ప్రణీతము.)

బాలకళానిధి ప్రణీతమైన

టీకాతాత్పర్యసహితము.

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్యగా,

శ్రీసత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

రాజమహేంద్రవరము:

శ్రీ సత్యానంద ప్రెస్ నందు

ముద్రింపబడినది.

1932



[వెల 3 అణాలు.

# పీఠిక.

కుమారీశతకము బాలికల విద్యాభివృద్ధికిని ముందు తాము సంసార కృత్యములం దభివృద్ధికి వచ్చుటకును ముఖ్యమైనదని యెల్లరకుం దెలిసిన విషయమే అందు టీకాతాత్పర్యములం జక్కఁగా విమర్శించి యేపాత్ర మనుకూలమైనదో దానినే బుద్ధిమంతులు గ్రహింతురుగాక యని మాతలంపు ఈశతకము మాధనాకర్షణకేగాక బాలికల విద్యాభివృద్ధికొరకై చక్కని శైలిని టీకాతాత్పర్యములు వ్రాయించి ముద్రింపించితిమి. ఇందు మంచి చెడ్డలు ప్రాజ్ఞులే గ్రహింతురుగాక.

శ్రీ భూ నీళా హైమవ
తీ భారతు లతులశుభవ ♦ తిగ నెన్నుచు స
త్సౌభాగ్యము నీకొసఁగఁగ
లో భావించెదరు ధర్మ ♦ లోల కుమారీ. 1

టీ. ధర్మలోల=మంచినడవడికపై నిష్టముగల, కుమారీ=పుత్రికా శ్రీ భూ ! నీళా ! హైమవతి ! భారతులు=లక్ష్మియు, భూదేవియును, నీళాదేవియును, పార్వతియును, వాణియును, (నిన్ను) అతుల శుభవతి గన్=తులలేని శుభవతిగా, ఎన్నుచున్=నుతించుచు, నీకున్=నీకు, సత్సౌభాగ్యమున్=మాంగళ్యవతిగా, భాగ్యవతిఁగా (మొదలగుశుభములను) ఒసఁగఁగన్=దయ సేయుటకు, లోన్=ఆత్మలలో, భావించెదరు=తలంతురు.

తా. మంచినడతగల యోబాలికా లక్ష్మి భూమి నీళ హైమవతీ సరస్వతులు నిన్ను సకలైశ్వర్యవతిగాఁ జేయఁగోరుచు కాపాడుచుందురు గాక.

క. చెప్పెడి బుద్ధులలోపల
దప్పకు మొకకైన సర్వ ♦ ధర్మము లందున్
మెప్పొంది యిహపరంబులఁ
దప్పింతయు, లేక మెలఁగ ♦ దగును గుమారీ. 2

టీ. కుమారీ ! చెప్పెడుబుద్ధులలోపలన్=నీకు నేను బోధించునీతులలో నొక్కటైనను, తప్పక=విడువక, సర్వధర్మములందున్=నీతులన్నిటిలో, మెప్పు=గౌరవమును, ఒంది=పొంది, ఇహపరంబులన్=ఈలోకములో, పరలోకములో, తప్పు=దోషము, ఇంతయున్=అణువంతైనను, లేక= ఉండనీక, మెలంగన్ దగున్=చరింపవలెను.

తా. నేనుచెప్పెడి నన్నినీతులను తెలిసి యట్లు మెలంగి యిహపర సుఖములం బొందుము.

క. ఆటలఁ బాటలలో నే
మాటయు రాకుండఁ దండ్రి ♦ మందిరమందున్
బాటిల్లు కాఁపురములో
వాటమెఱిఁగి బాలతిరుగ ♦ వలయుకుమారీ. 3

టీ. కుమారీ ! ఆటలన్=ఆటలయందును, పాటలలోన్=పాటలందును, ఏమాటయున్=తగవులు, రాకుండన్=తెచ్చుకొనక, తండ్రిమందిరమందున్=పుట్టినింటియందును, పాటిల్లుకాపురములోన్=పోవనున్న యత్తవారింటను, వాటమెఱిఁగి=జాగ్రతగా, బాల=అబల, తిరుగవలయున్=నడుచుకొనవలెను.

తా. ఆటపాటలయందు పుట్టింటివద్ద గాని యత్తింటివద్దగాని నిష్ఠురములు రాకుండ బహుజాగ్రతగా నడుచుకొనవలయును.

క. మగనికి నత్తకు మామకుఁ
దగసేవ యొనర్చుచోట ♦ దత్పరిచర్యన్
మిగుల నుతిఁబొందుచుండుట
మగువలకుం బాడి తెలిసి ♦ మసలు కుమారీ. 4

టీ. కుమారీ ! మగనికిన్=పతికిని, అత్తకున్=అత్తగారికిని, మామకున్= మామగారికిని, తగన్=ఒప్పిదముగా, సేవన్=పరిచర్య, ఒనర్చుచోటన్= సేయునపుడు, తత్పరిచర్యన్=ఆపరిచర్యలందు, మిగులన్=ఎక్కువ,నుతిన్,

పొగడ్త=పొందుచుండుట, గణించుట, మగువలకున్=వనితలకు, పాడి=తగును, తెలిపి=ఈగుట్టెఱింగి, మసలు=తిరుగుము.

తా. ఆడుబిడ్డ పతికిని అత్తమామలకును సేవలుసేయవలయును ఆసేవలు జాగ్రతగాచేసి వారిమెప్పుసంపాదించుకొనుటకై మెలకువగాసంచరింపుము.

క. పెనిమిటి వలదని చెప్పిన
పని యెన్నఁడుఁ జేయరాదు ♦ బావల కెదుటన్
గనఁపడఁగ రాదు కోపము
మనమున నిడుకొనక యెపుడు ♦ మసలు కుమారీ. 5

టీ. కుమారీ! పెనిమిటి=మగఁడు, వలదు=వద్దు, అని చెప్పినపని యెన్నడున్=అనిన యేపనియైనను, జేయరాదు=సేయకూడదు, బావలకెదుటన్=నీభర్తయన్నగార్లయెదుట, కనపడగరాదు=తిరుగఁగూడదు, మనమున్=నీలోకోపమున్=ఆగ్రహము, ఇడుకొనక=ఉండనీక, యెపుడున్=యెప్పుడును, మసలుము=తిరుగుము.

తా. నీభర్తవద్దనినపని మానుటయు బావలయెదుట తిరుగకుండుటయు ఒరులయెడల కోపములేకుండుటయు నీకు సుఖము నిచ్చును.

క. పరపురుషు లన్నదమ్ములు
వరుఁడే దైవంబు తోడి ♦ పడుచులు వదినెల్
మఱఁదండ్రు నత్తమామలు
ధరఁ దల్లియుఁ దండ్రియనియుఁ ♦ దలఁపుకుమారీ. 6

టీ. కుమారీ! ధరన్=భూమియందు, పరపురుషులు=నీతండ్రియుభర్తయుం బిడ్డలుంగాక ఇతరులు, అన్నదమ్ములు=నీతోబుట్టువులు, వరుఁడే=భర్తయే, దైవంబు=దేవుఁడు, తోడుపడుచులువదినల్=నీవదినెలు మఱదండ్రు, నీతోబుట్టినవారు, అక్కచెల్లెండ్రు, అత్తమామలు=నీపతితలిదండ్రులు, తల్లియున్ దండ్రియున్=నాతలిదండ్రులవలె, దలపు=యెంచుకొనుము.

తా. నీపతిని దేవుఁడుగాను, పరపురుషుల నన్నదమ్ములుగాను, పదినెమఱదండ్ర నక్కచెల్లెండ్రఁగాను, అత్తమామలఁ దల్లిదండ్రులుగాను యెంచుకొనుము.

క. పదములఁ పయిఁ జెయి వేయక
మదవతి పతిచెంత నిద్ర ♦ మరగినఁ జేతుల్
గదలంగ నీక కట్టుచు
గదఁగొని శిక్షించుయముఁడు ♦ కాంక్షఁ కుమారీ. 7

టీ. కుమారీ ! మదవతి=కాంత ; పదములపైన్=పతిపాదములపై, చెయి వేయక=చేయినుంచక, పతిచెంతన్=పెనిమిటిపద్ద, నిద్రమరిగినన్=పరుండ నేర్చినచో, చేతుల్=నీచేతులను, కదలంగనీకకట్టుచు=కదలనట్లుకట్టి, గదఁగొని శిక్షించుయముడు=యముడుతనగదతో ; కాంక్షన్=పట్టుదలగాశిక్షించును.

తా. భర్తపాదములం బట్టకుండ భర్తప్రక్కలో పరుండి నిద్రించు భార్యను యముండు తనయాయుధముచే దండించును గావున నట్లు బాధ కలుగకుండ భర్తపాదముల భక్తితో పట్టవలయును.

క. తెచ్చినఁ దేకుండిన నీ
కిచ్చిన నీకున్న మగని ♦ నెగ్గాడకుమీ
యొచ్చెము నీపైఁ దేలును
రచ్చల కామాట లెక్కు అవ్వ ♦ కుమారీ. 8

టీ. కుమారీ ! తెచ్చినన్=వస్త్రధనఫలాహారాదులు తెచ్చినను, తేకుండినన్=తేకున్నను, నీకిచ్చినన్=ఇచ్చినను, ఈకున్నన్=ఈయకపోయినను, మగనిన్=పతిని ; ఎగ్గాడకుమీ=తూలనాడబోకుసుమా, ఒచ్చెమునీపై తేలును=నీపైకష్టముతోచును, రచ్చలకున్=వీధిలోనికి, అమాటలెక్కు=నీ నిష్టురములు చేరును, రవ్వకుమారీ=దానివలన నెల్లరు నిన్ను చెడ్డదియందురు.

తా. నీ ప్రాణేశ్వరుడు నీకు కావలసిన వేవియైనను తెచ్చినను తేకున్నను తేలేదు నాకీయలేదు అని నిందించితివేని యతనికి కోపము గల్గుటగాక నూరివారందరు నిన్ను చెడ్డదియని చెప్పుకొందురు గాన నట్లనకుము.

క. మఱఁదండ్రు వదినె లత్తలు
మఱఁదులు బావలు కోమాళ్లు ♦ మఱి పెద్దలు రా
నుఱవడిఁ బీఁటలు మంచము
లరుగులు దిగుచుండవలయు ♦ నమ్మకుమారీ. 9

టీ. కుమారీ! మఱదండ్రు=పతిచెల్లెండ్రు, వదినెలు=పతియక్కలు అత్తలు నీపతితల్లి పెదపినతల్లులు మొదలగువారు, మఱదులు=పతితమ్ములు, బావలు=పతియన్నలు, కోమాళ్లు, నీయొక్క-గాని నీబావయొక్క-గానిబిడ్డలు, మఱి=ఇంకను, పెద్దలు, రాన్=వచ్చినప్పుడు, ఉఱవడి=తొందరగా, పీటను, మంచములును, అరుగులు, దిగుచున్=దిగి, ఉండవలయున్=ఉండవలయును.

తా. వదినెలు బావలు మఱదండ్రు అత్తమామలు వచ్చినపుడే యరుగు మీదగాని పీటపైగాని కూర్చుండినచో తొందరగా దిగవలయును.

క. నోరెత్తి మాటలాడకు
మాఱాఁడకు గోపపడిన ♦ మర్యాదలలో
నోరంత తప్పి తిరుగకు
మీఱకు మీయత్తపనుల ♦ మెలఁగు కుమారీ. 10

టీ. కుమారీ! నోరెత్తి=గట్టిగా, మాటలాడకు=పలుకకుము, మారాడకు కోపపడిన=ఎవ్వరుకోపగించి యేమనినను సమాధానముచెప్పకుము, మర్యాదలలోన్=మంచిచెడ్డలను, నోరంత=కొంచెమైనను, తప్పితిరుగకు=గడచి నడువవద్దు, అత్తపనులన్=మీయత్తచెప్పెడు పనులను, మీరకుమీ=మరువకచేయుము, మెలగు=జాగ్రతగా తిరుగుము.

తా. కంచుగంటవలెఁ గణగణలాడక నెవ్వరితోనైనను మెల్ల మాటలాడి యెదురులునిన్నేమేని యనినను ఊరకొనుము అత్తగారు చెప్పిన పనులను జాగ్రతగా సేయుము.

క. పతి పరకాంతలతో సం
గతిఁ జేసిన నాదు పుణ్య ♦ గతి యిట్లనుచున్

మతిఁదలఁపవలయు లేదా
బతిమాలఁగవలయుఁగలహ ♦ పడకు కుమారీ. 11

టీ. కుమారీ! పతి=భర్త, పరకాంతలతోన్=యితరస్త్రీలతో, సంగతిఁజేసినన్=సహవాసముజేసినను, నాదుపుణ్యగతి యిట్లనుచున్=ఇది నాపూర్వపుణ్యఫలమని, మతిన్=మనస్సున, దలఁప=అనుకొనవలయు, లేదా=లేనిచో, బతిమాలగవలయున్=ఈపనిమీకుఁదగదని మాన్పుకొనుటుచితము, గలహపడకు=అట్లు బ్రతిమాలక కలహమెన్నఁడును పడకుము.

తా. నీమగండితరకాంతతో నిష్టముగా ముచ్చటించిన నిది నాపాపమని యెంచుకొని వీలైనచో మగని బ్రతిమాలి మాన్పవలెనేగాని కలహింపగూడదు.

క. పతిపాపపుఁ బనిజెప్పిన
బతిమాలి మరల్పవలయుఁ ♦ బతి వినకున్నన్
హితమనుచు నాచరింపుము
మతిలోపల సంశయంబు ♦ మానికుమారీ. 12

టీ. కుమారీ! పతి=మగడు, పాపపు=చెడు, పని=పనిని, జెప్పిన=సేయుమనినచో, బతిమాలి=వేడి, మరల్పవలయున్=ఆకార్యమునుండి తప్పించుకొనవలెను, బతి=భర్త, వినకున్నన్=ఒప్పుకొననిచో, హితమనుచున్=మంచిదేయని, నాచరింపు=సేయుము, మతిలోపల=నీలో, సంశయంబు=అనుమానము, మాని=విడిచితప్పకసేయుము.

నీమగండెట్టిచెడుపనిం జెప్పినను సాధ్యమైనంతవరకు వేడుకొని తప్పించుకొనుము అట్లాతఁడు విననిచో నట్లే సేయుము దైవమే కాపాడును.

క. తిట్టినఁ దిట్టక కొట్టినఁ
గొట్టక కోపించెనేని ♦ గోపింపక నీ
పుట్టిన యింటికిఁ బాదము
పెట్టిన యింటికిన్ని వన్నె ♦ పెట్టు కుమారీ. 13

టీ. కుమారీ! తిట్టినన్=తిట్టినచో, తిట్టకన్=తిట్టక, కొట్టినన్=కొట్టినచో, కొట్టక=కోపించెనేని, కోపపడినచో, గోపంపక=కోపపడక గారవముగాఁ జూచుచు నీభర్తయింటికిని, పుట్టినయింటికిని=నీపుట్టింటికిని వన్నెబెట్టు=కీర్తిసంపాదింపుము.

తా. నీవుబలవంతురాలవు మాటకారివియైనను నీభర్తతిట్టినఁ దిట్టక కొట్టినఁ గొట్టక కన్నయింటివారికిని యత్తవారికిని మంచిపేరు గడింపుము.

క. దబ్బఱ లాడకు గదిమిన
బొబ్బలు పెట్టకుము మంచి ♦ బుద్ధి గలిగి యెం
దెబ్బఱికముఁ బూనక కడు
గొబ్బునఁ జిత్తమున వానిఁ గూర్పు కుమారీ. 14

టీ. కుమారీ! దబ్బరలు=అబద్ధములు, అడక=చెప్పకుము, కదిమినన్=నీభర్త నిన్నుకోపపడినను, బొబ్బలు=కేకలు, పెట్టకుము=వేయకుము, మంచిబుద్ధిగలిగి, ఎందున్=యేపనిలోనైనను, ఎబ్బెరికమ=అసహ్యమును, బూనక=పడక, కడుగొబ్బునన్=తొందరగా, చిత్తమున్=మనస్సు, వానినే=ఆపనులను, గూర్పుము=తలంపుము.

తా. ఎవ్వరితో నెప్పుడును అబద్ధములాడకుము పతికొట్టినను కేకలు వేయక అతడుచెప్పిన పనులు శ్రద్ధతో సేయుము.

క. పతి భుజియించిన పాత్రను
మెతుకొక్కటియైన భార్య ♦ మెసఁగుటకై తా
హితమూనకున్న నదియొక
పతియే కడఁ బాపజాతి ♦ జగతిఁ గుమారీ. 15

టీ. కుమారీ! భార్య, పతి, భుజియించినపాత్రను=భోజనము, చేసిన గిన్నెయందు, మెతుకుఒక్కటియైనన్=ఒక్క మెతుకైనను, మెసగుటకై=తినుటకు, తాన్=తాను, హితము=ప్రేమ, ఊనకున్నన్=అందకున్నచో, అది

ఆభార్య, ఒకసతియే=భార్యయా, జగతిన్=భూమిలో, కడుపాప
జాతి=చాలాదుష్టురాలు.

తా. పతియెంగిలి నొక్కు మెతుకైనను తినవలయునను ప్రీతి పతివ్ర
తకుండును అట్లు లేనియాడుది దుష్టురాలు పాపాత్మురాలని యెంచబడును.

క. జపములు గంగాయాత్రలు
తపములు నోములును దాన ♦ ధర్మంబులు పు
ణ్యపురాణము పతి భక్తికి
నుపమింపను సాటిరాక ♦ యుండుఁ గుమారీ. 16

టీ. కుమారీ! జపములు (లక్ష్మీపంచాక్షరి) మొదలగునవి, గంగాయా
త్రలు=పుణ్యనదీస్నానములు, దపములు, నోములు=శుక్రవారమునోములు
మొదలగునవి, దానధర్మంబులు=కూడుగుడ్డలిచ్చుట, పుణ్యపురాణము=రా
మాయణభారతములు, పతిభక్తికిన్=మగనిసేవకంటె, ఉపమించిన=సాటి
తెచ్చుకొనరాకయుండున్=సరిపడ నేఱవు.

తా. పతిభక్తికెట్టి జపతపపురాణస్నానదానధర్మములును సరి రావు.

క. ఇరుగు పొరుగిండ్లకైనను
వరుఁడో కాకత్తగారో ♦ వదినెయొ మామో
మఱఁదియొ సెలవీకుండఁగఁ
దరుణి స్వతంత్రించి పోవఁ ♦ దగదు కుమారీ. 17

టీ. కుమారీ! ఇరుగుపొరుగిండ్లకైనను=నీయింటిప్రక్కయిండ్లకైనను,
వరుడో=పతిగాని, అత్తగారో, వదినయొ, మామయొ, మఱదియొ, సెలవీ
యకుండగ=చెప్పకుండఁగా, తరుణి=అత్తింటికోడలు, స్వతంత్రించి=
తనయిష్టప్రకారము, పోవఁదగదు.

తా. నీయత్తవారితాలూ కెవ్వరిని అడుగకుండ నీవు స్వతంత్రించి
యింటిదరి యింటికైనను పోరాదు.

క. కూతురు చెడుగై యుండిన
మాతది తప్పన్నమాట ♦ మదినెఱుఁగుదుగా
నీతలిదండ్రులకు నప
ఖ్యాతులు రానీయఁగూడ ♦ దమ్మ కుమారీ. 18

టీ. కుమారీ! కూతురు, చెడుగై యుండినన్=చెడ్డదైనచో, మాతది=తల్లిది, తప్పన్నమాట=తప్పనుసంగతి, మది నెఱుఁగుదుగా=నీమనస్సునకే తెలియునుగదా, నీతల్లిదండ్రులకున్=నీతల్లిదండ్రులకు, అపఖ్యాతి=చెడ్డపేరు, రానీయఁగూడదు=నీవు తేక జాగ్రతగానడువుము.

తా. నీవు చెడ్డదానివైనచో (తల్లిపాలు బిడ్డయిల్లు పాలువాకిలియందురు.) గాన మంచిపనులఁజేసి అట్టిపేరు నీతల్లికి రానీయకుము.

క. అమ్మకు రెం డబ్బకు రెం
డిమ్మహిఁ దిట్టించు కూతు ♦ రెందుకు ధరనా
ద్రిమ్మరి పుట్టకపోయిన
నిమ్మళమని యండ్రుజనులు ♦ నిజము కుమారీ 19

టీ. కుమారీ! అమ్మకురెండుతిట్లును, అబ్బకురెండు=తండ్రికిరెండుతిట్లును, ఇమ్మహి=భూమిపై, దిట్టించుకూతురు=పరులచేతితిట్టించుబిడ్డ, యెందుకు=ప్రయోజనములేదు, ధరనా ద్రిమ్మరి=భూమిమీదనట్టిచెడ్డది, పుట్టకపోయిన=పుట్టకుండినను, నిమ్మళమని=మంచిదని, యండ్రుజనులు=మనుష్యులనుకొందురు, నిజము=తప్పకననుకొందురు.

తా. కుమార్తెచెడ్డదియై దుర్వాదుక తెచ్చుటకంటె నట్టిది పుట్టకున్నను మేలే యని జనులనుకొందురుగాన తలిదండ్రులకుకీర్తి తెచ్చి తాను మంచిదనిపించుకొనవలెను.

క. తనబావల పిల్లలయెడఁ
దన మఱఁదుల పిల్లలందుఁ ♦ దనపిల్లల కం
టెను మక్కువ యుండవలెన్
వనితల కటులైన వన్నె ♦ వచ్చుఁ గుమారీ. 20

టీ. కుమారీ! తనబావలపిల్లలయెడ=మగనియన్నగారిబిడ్డలందును, తన మఱదులబిడ్డలందు=పతితమ్మునిబిడ్డలందు, తనపిల్లలకంటెను మక్కువ=నీబిడ్డలకంటె ప్రీతి, యుండవలెన్=ఉండవలయును, వనితలకట్టులైన=ఆడువాండ్రకట్లున్నచో, వన్నె=గౌరవము వచ్చును.

తా. తనబిడ్డలకన్నను, బావబిడ్డలను మఱదిబిడ్డలను యితరులబిడ్డలను ప్రీతిగా జూచినకాంతకు పెక్కుకీర్తివచ్చును.

క. ధనహీనుఁడైనఁ గడు దు
ర్జనుఁడైనఁ గురూపియైన ♦ జారుండైనన్
విను పాపియైన నెప్పుడుఁ
దనపతియే తనకు దైవ ♦ తంబు కుమారీ. 21

టీ. కుమారీ! ధనహీనుఁడైనన్=పేదవాఁడైనను, గడుదుర్జనుఁడైనన్=మిక్కిలిపాపాత్ముడైనను, కురూపియైనన్=అందములేనివాఁడైనను, జారుండైనన్=స్త్రీలోలుండైనను, విను, పాపియైనను=దుర్నడక గలవాఁడైనను ఎప్పుడున్=ఎల్లకాలమును, దనపతియే=తనమగఁడే, తనకుదైవతంబు=దేవునితో సమానుడు.

తా. అందహీనుడైనను కురూపియైనను దుర్మార్గుఁడైనను తనమగఁడే తనకు దైవముగాని వేరుదైవము దైవముగాడు.

క. ధనవంతుఁడైన యప్పుడు
పెనిమిటిచిత్తంబెఱింగి ♦ పెండ్లాము మెలం
గును లేమి మెలఁగనేర్చిన
వనితకు లోకమున వన్నె ♦ వచ్చు కుమారీ. 22

టీ. కుమారీ! ధనవంతుడైనయప్పుడు=ధనముగలవాఁడైయున్నప్పుడు, పెనిమిటిచిత్తంబెఱింగి=భర్తయొక్కమనస్సును గనిపెట్టు, పెండ్లాము=భార్య, మెలంగగనేర్చినన్=భర్తకిష్టముగా సంచరింప నేర్చుకొనిన, వనితకున్=భార్యకు, వన్నెవచ్చున్=ఖ్యాతివచ్చును.

తా. భర్తధనవంతుడై యున్నప్పుడు అతనికిష్టము గా మెలంగుట గొప్ప కాదు. అతనికి లేమివచ్చినప్పు డిష్టముగానున్న భార్య కీర్తిం గాంచును.

క. తలిదండ్రు లన్నదమ్ములు
తులదూగగ నిమ్మ పసిడి ♦ తో నైనను వా
రల యింట సతతముండుట
వెలదికి మర్యాదగాదు ♦ వినవె కుమారీ. 23

టీ. కుమారీ! తల్లిదండ్రులు, అన్నదమ్ములు, పసిడితోన్=బంగారము తో, తులదూగగనిమ్ము=తక్కెడలో సరిగా నెత్తువచ్చునట్లు తూగనిమ్ము, అనఁగావారు ధనముగలవారు కానిమ్ము, వెలదికిన్=స్త్రీకి, సతతమున్= ఎల్లప్పుడు, వారలయింటన్=వారియింటిలో, ఉండుట=నివసించుట, మర్యాదకాదు=గౌరవముకాదు, వినవె=వినుము.

తా. తల్లిదండ్రులలో నగువారు ఎంతధనవంతులైనను వారియింటిలో స్త్రీ యెల్లకాలమును ఉండరాదు. ఉండుట మర్యాదకాదు.

క. కడుపారఁ గూడుఁ గూరలుఁ
దొడవులు వస్త్రములు మిగుల ♦ దొరకవనుచుఁదాఁ
వడితనమునఁ బెనిమిటితో
నెడఁబాసి చరింపగూడ ♦ దెపుడుఁ గుమారీ. 24

టీ. కుమారీ! కడుపారన్=కడుపునిండా, కూడుగూరలు=అన్నమును కూరయును, తొడవులు=నగలు, వస్త్రములు=బట్టలు, మిగులన్=చాలా, దొరకవనుచున్=లభించవని, తాన్=తాను, వడితనమున్=తొందరచేత, పెనిమిటితోన్=మగనితో, ఎడబాసి=విడిచి, ఎపుడున్=ఒక్కనాఁడైనను, చరింపఁగూడదు=తిరుగరాదు.

తా. అన్నము కూరలు బట్టలు నగలు దొరుకుటలేదని నీభర్తతో కల హించి యెన్నడు విడచిగాని విచారముగాగాని ఉండకుము.

క. పిల్లలఁ గనుఁగొనఁదలఁచిన
యిల్లాలు గతాగతంబు ♦ నెఱుఁగక రాగై
యల్లరిఁ బెట్టినఁ దాఁ జెడుఁ
నుల్లసములఁ బడును గీడు ♦ నొందు కుమారీ. 25

టీ. కుమారీ ! పిల్లలన్=సంతానమును, కనుఁగొనఁదలఁచిన=గోరిన స్త్రీ, గతాగతంబు=ముందువెనుకలను, ఎఱుఁగక=తెలియక, రాగై=ధూర్తురాలైన, అల్లరిబెట్టిన=రట్టుచేసిన, తాన్=తాను, చెడును=పాడగును, ఉల్లసమునన్=మాటలను, పడునుకీడు=కష్టమును, ఒందున్=అనుభవించును.

తా. పిల్లలనుగనగోరిన స్త్రీ ఖర్చువెచ్చములు తెలునుకొని సంచరించవలెను. అట్లుగాక ధూర్తురాలైన నిందింపఁబడును.

క. పతి కత్తకు మామకు స
మ్మతిగాని ప్రయోజనంబు ♦ మానఁగవలయున్
హితమాచరింప వలయును
బ్రతుకున కొక వంకలేక ♦ పరఁగుఁ గుమారీ. 26

టీ. కుమారీ ! పతికిన్=మగనికి, అత్తకున్=మగనితల్లికి, మామకున్=మామగారికి, సమ్మతిగాని=ఇష్టములేని, ప్రయోజనంబు=పనిని, మానఁగవలయున్=చేయరాదు, హిత=పతిమొదలగువారి కిష్టమైన పనులెల్ల, చేయవలెన్=సేయుము, బ్రతుకునన్=నీవున్నంతవరకును, ఒకవంకలేక=చెడుగనిపించుకొనక, పరగు=మంచిగడింపుము.

తా. మగనికి అత్తమామలకు యిష్టమైన పనులను జేయుచు బ్రతికినన్నాళ్లు మంచిపేరు తెచ్చుకొనుచుండుము.

క. పోకిళ్లు పోక పొందిక
నాకులలోఁ బిందెరీతి ♦ నడఁకువ గానం
తో కలసిమెలసి యుండిన
లోకములోపలను దావె ♦ లుంగు కుమారీ. 27

టీ. కుమారీ ! పోకిళ్లపోక=చెడుకార్యమాచరింపక, పొందికన్=మంచిగా, ఆకులలోబిందెరీతి=ఆకులలోకనఁబడనిపిందెవలె, అడఁకువగాన్=పొందికగా, ఎంతో=పెక్కు, కలిసిమెలసి=అణకువగా, ఉండినన్=ఉన్నచో, లోకములోపలను=దేశమందు, తాన్=ఆమె, వెలుగున్=కీర్తి పొందును.

తా. మంచికార్యములు సేయుచు పెద్దలయందు భక్తినుంచి అందరకు మంచిగాతిరిగినకాంతకు కీర్తివచ్చును.

క. అత్తపయిన్ మఱఁదలిపయి
నెత్తిన కోపమున బిడ్డ ♦ నేడ్పించుటకై
మొత్తినఁదనకే కీడగుఁ
జిత్తములో దీనిఁజింత ♦ సేయు కుమారీ. 28

టీ. కుమారీ ! అత్తపయిన్=అత్తగారిమీద, మఱఁదలిపైన్=మఱఁదలిమీద, ఎత్తినకోపమునన్=కోపముకలిగి, బిడ్డన్=చంటిపిల్లను, ఏడ్పించుటకై=ఏడిపించుటకు, మొత్తినన్=కొట్టినచో, తనకే=కోడలికే, కీడు=పాపము, అగున్=దాపరించును, దీనిన్=ఈమాట, చిత్తములోన్=మదిలో, చింతసేయు=యెంచుకొనుము.

తా. అత్తపైగాని ఆడుబిడ్డపైఁగాని కోపముచే నీబిడ్డలను కొట్టి యేడిపించినచో ఆకీడు నీదేకాని వారిదికాదు గాన నొకరిపై కోపమున నీపిల్లలను కొట్టకుము.

క. మృతియైనను బ్రతుకైనం
బతితోడనె సతికిఁజెల్లుఁ ♦ బతిఁబాసిన యా
బ్రతుకొక బ్రతుకాజీవ
న్మృతిగాక వధూటికెన్న ♦ నిదియు కుమారీ. 29

టీ. కుమారీ ! మృతియైనను=ప్రాణముపోవనున్నను, బ్రతుకైనన్=సుఖమైనను, సతికి=ఉత్తమురాలికి, పతితోడనె=భర్తతోనుండుటయే, చెల్లున్ ఒప్పును, పతిబాసినయాబ్రతుకు=మగనివిడిచిన జీవనము, వధూటికిన్=

భార్యకు, ఎన్నన్=యోచింపఁగా, జీవన్మృతిగాక=బ్రతికియు చచ్చినట్లే గాక, ఇదియుఁ=మగనివిడిచినదియు, ఒకబ్రదుకా=బ్రతికియున్నను ప్రయోజనము లేదనుట.

తా. ఎన్నికష్టములు గలిగినను భర్తతోనే యుండినదే బ్రతుకు గాని భర్తతో సుఖములేదని సర్వసుఖములు పొందుచు పుట్టింటనున్న బ్రతుకు చావుతో సమానము.

క. మగని ప్రియ మబ్బెననుచును
దెగనీలిగి యింటివారి ♦ దిగద్రొక్కుచు దుం
డగురాలై తిరిగిన సరి
మగువలలో నిదియె తప్పు ♦ మాట కుమారీ. 30

టీ. కుమారీ! మగనికిన్=భర్తకు, ప్రియము=ఇష్టము, అబ్బెననుచున్=కుదిరినదని, తెగనీలిగి=అతిశయించి, ఇంటివారిఁ=ఇంటిలోనుండిన అత్త మామ మొదలగువారిని, దిగఁద్రొక్కుచున్=అలక్ష్యము సేయుచు, దుండగురాలై=దుష్టురాలై, తిరిగినన్=సంచరించిన, సరిమగువలలో=తోటిస్త్రీలలో, ఇదియె=ఇట్లుతిరుగుట, తప్పుమాట=చెడ్డమాట అగును.

తా. తనభర్తకు తనమీద మిక్కిలి యనురాగ మున్నదని తక్కిన యత్తగారు మొదలగువారిని లక్ష్యపెట్టక తిరిగినయెడల తనతోటివారిలో తప్పుమాటను పొందును. అనగా నిందింపఁబడును.

క. జీవములు భర్తపదగా
జీవములని చిత్తమందు ♦ జింతించిన ల
క్ష్మీవల్లభు చరణంబుల
సేవలతాంగులకు నెమ్మిఁ ♦ జేయుఁ కుమారీ. 31

టీ. జీవములు=తనప్రాణములు, భర్తపదరాజీవములని=భర్తపదములే యని, చిత్తమందున్=మనస్సులో, చింతించినన్=తలంచినయెడ, లతాంగుల

కున్=ఆడవాండ్లకు, నెమ్మిన్=ప్రేమతో, లక్ష్మీవల్లభు సేవ=విష్ణునిపూజిం చినట్లు, అగున్=ఫలితముపచ్చును.

తా. భర్తపాదములు పూజించినచో విష్ణుదేవుని పూజించి నంతకంటె యెక్కువఫలము చేకూరును.

క. కడుబుద్ధిగల్గి మెలఁగినఁ
బడఁతుక పుట్టింటివారు ♦ పదివేల వరా
లిడుకంటె కీర్తియగు ద
మ్మిడి లేకుండినను నేర్పి ♦ మెలఁగు కుమారీ. 32

టీ. కుమారీ! పడతుక=వనిత, కడుబుద్ధిగలిగి=మిక్కిలి గుణముగలిగి, మెలంగినన్=తిరిగినచో, పుట్టింటివారు=తలిదండ్రులు, పదివేలవరాలు=మి క్కిలిధనము, ఇడుటకంటె=ఒసగుటకంటె, కీర్తి=పేరు, అగున్=వచ్చును, ద మ్మిడిలేకుండిన=పేదతనమైనను, నేర్చి=కాపురముసేయుటెరిగి, మెలగు= నడువుము.

తా. పుట్టింటినుండి చాలధనము తెచ్చినను చెడునడవడి నడచినచో నెవ్వరును మెచ్చరు నీవుకాని తేకున్నను గుణముకల్గి నడచినచో యెన్నో వేలిచ్చిన కన్న నీతలిదండ్రులకు గౌరవము వచ్చును. కావున జాగ్రతగా నడచుకొనుము.

క. కడుఁబెద్దమూటఁ దెచ్చినఁ
జెడుగై వర్తించెనేని ♦ చిరతరచింతం
బడుదురు తలిదండ్రులు తో
బడుచులు సోదరులు నింద ♦ బడుదు కుమారీ. 33

టీ. కుమారీ! చెడుగై=దుర్మార్గురాలై, కడుబెద్దమూట=చాలధనము, దెచ్చినన్=గడించినను, తలిదండ్రులు, తోడుబడుచులున్=అక్కచెల్లెండ్రు ను, సోదరులున్=అన్నదమ్ములు, చిరచింతంబడుదురు=మిక్కిలివిచారింతు రు, నిందఁబడుదు=నీకు చెడ్డపేరువచ్చును. —

తా. చెడుగైయెంతధనము సంపాదించినను తలిదండ్రాదులు విచారింతురు నీకును అపకీర్తి వచ్చును.

క. పుట్టింటివారి నీచతఁ
బెట్టకు మత్తింటివారు ♦ పెట్టెడి బాధల్
పుట్టింటఁ దెలియనీయకు
రట్టడి చెలియండ్రదియె ♦ అవ్వ కుమారీ. 34

టీ. కుమారీ! పుట్టింటివారిన్=కన్నవారిని, నీచతఁ=వంచన, పెట్టకుము=సేయకుము, అత్తింటివారు పెట్టెడు బాధల్=అత్తవారు పెట్టుకష్టములు పుట్టింటఁదెలియనీయకుము=తలిదండ్రులతోఁజెప్పకుము, (అట్లుచెప్పినచో) రట్టడిచెలి=అల్లరిపిల్ల, యందురు. అదియెరవ్వ=అదియేయపకీర్తికి కారణము.

తా. పుట్టింటిలోటును అత్తవారింట అత్తవారింటిలోటును పుట్టింట చెప్పినచో లోకులు అల్లరిపిల్లయని నిందింతురు.

క. తనకెంత మేలుచేసిన
మనమున కింపైన పనుల ♦ మసలిన దాసీ
వనితల కెన్నటికైనం
జనవిచ్చి మెలంగరాదు ♦ జగతి కుమారీ. 35

టీ. కుమారీ! తనకెంతమేలుచేసినన్=తనకెంతయుపకారము చేసినను, మనమునకున్=మనస్సునకు, ఇంపైనపనులన్=ఇష్టమైనపనులచేతను, మసలినఁ=తిరిగినను, దాసీవనితలకున్=పరిచారికలకు, ఎన్నటికైనన్=ఎప్పటికిని, చనవిచ్చి=పరిచయముకలిగించి, మెలంగరాదు.

తా. తనకు మేలుచేసినను మనస్సునకిష్టమైనపనులు చేసినదియైనను దాసికెన్నడును జనువియ్యరాదు.

క. కులదేవతలకు బెట్టిన
పొలుపున దనయింటి యాడు ♦ బొట్టెలకెల్లం

గలమాత్ర మొసఁగకుండినఁ
గలఁతపొడము గానమేలు ♦ గాదు కుమారీ. 36

టీ. కుమారీ! కులదేవతలకున్=ఇష్టముగల అమ్మవార్లకు, బెట్టినపాలుపునన్=పెట్టునట్లుగా, తనయింటి యాడపడుచులకెల్లన్=మగనిచెల్లెండ్రకందరికిని, కలమాత్రము=తనకున్నంతలో, ఒసంగకుండిన=పెట్టకున్నచో, కలత=విరోధము, పొడమున్=వచ్చును, దానన్=అందువల్ల, మేలుకాదు=లాభములేదు.

తా. నీకు ప్రీతియైన అమ్మవార్లకు పండ్లు మొదలుగాగలవిచ్చినట్లు నీ యాడుపడుచులకు భోజనాదులు పెట్టనిచో కలహమువచ్చును గాన నీయక్కచెల్లెండ్రకన్న మిన్నగా చూచుచుండుము.

క. బద్దకము సంజనిదుర
వద్దనుమీ దద్దిరంబు ♦ వచ్చును దానన్
గద్దింతు రింటివారలు
మొద్దందురు తోడివారు ♦ ముద్దు కుమారీ. 37.

టీ. కుమారీ! బద్దకము=మందము, సంజనిద్దుర=ప్రొద్దుపొడుచుటకు ముందు, ప్రొద్దుకుంకినవెనుక కొంతసేపు సంధ్యాకాలములందురు అప్పుడు నిద్రించుట, వద్దనుమా=కూడదు, దానసే=అందుచే, దద్దిరంబు=దోషము వచ్చును, ఇంటివారలు=భర్తమున్నగువారు, గద్దింతురు=కోపింతురు, తోడివారు=ఆడువాండ్రును, మొద్దందురు=పరిహసింతురు.

తా. సంధ్యవేళలందు నిద్రపోయి జడ్డిగానున్నయెడల అత్తమామలు కోపించుటయే గాక నీయీడువారు నవ్వుదురు.

క. ఇంటఁగల గుట్టు నీ పొరు
గింట రవంతైనఁ దెలుప ♦ నేగకు దానం
గంటసపడి నీవారలు
గెంటించెదరిల్లు వెడల ♦ గినుకఁ కుమారీ. 38

టీ. కుమారీ! ఇంటన్=ఇంటి, గుట్టు=రహస్యములను, నీపొరుగింటన్=యింటి ప్రక్కలయింటివారికైనను, రవంతైనన్=కొంచెమైనను, తెలుపన్=ఎఱిఁగింప, ఏగకుము=పోరాదు, దానన్=అందుచేత, నీవారలు=మీయత్తవారు, కినుకన్=ఆగ్రహముచేత, గెంటసపడి=ద్వేషించి, ఇల్లువెడలన్=ఇంటిలోనుండి యావలకుపోవునట్లుగా, గెంటించెదరు.

తా. నీయింటిలోనిగుట్టు సుమంతయైనను యిరుగు పొరుగిండ్ల జెప్పితి వేని నీయత్తమామలు భర్త మొదలగువారు నిన్నావలకుఁ బొమ్మందురు.

క. వేకువజామున మేల్కని
పైకిఁ వెడలివచ్చి ప్రాఁచి ♦ పని దీర్పవలెన్
లేకున్నఁ దెల్లవాఱిన
లోకులు నవ్వుదురు సభల ♦ లోనఁ కుమారీ. 39

టీ. కుమారీ! వేకువ=తెల్లవారు, జామున=సమయమున, మేల్కని=లేచి, పైకివెడలివచ్చి=నీగదిలోనుండి యీవలకువచ్చి, ప్రాఁచిపని=పాచి పనులు, దీర్పవలెన్=చేయవలయును, లేకున్నన్=అట్లుకానిచో, తెల్లవారిన=లోకులు=యితరులు, నవ్వుదురు=హేళనసేయుదురు, సభలలోన=రచ్చలయందుఁ గూడ చెప్పుకుందురు.

తా. తెల్లవారుజామునలేచి పాచిపనులన్నియుం జేసికొనక పొద్దెక్కి లేచితివేని చూచినవారు వినినవారు నవ్వుటయేగాక వింతగా కూడ ప్రజలు చెప్పుకొందురు.

క. ఇక్కడిది కక్కడ నక్కడి
దిక్కడఁ జెప్పినను వారి ♦ కిద్దఱికిఁ బగల్
పొక్కునఁగల చేడియ ల
మ్మక్కా యిరుమల్లనూరి ♦ యండ్రు కుమారీ. 40

టీ. కుమారీ! ఇక్కడిదక్కడన్=ఈయింటిమాటలాయింట, అక్కడి

దిక్కుడన్=ఆయింటిమాట నీయింట, వుభయులకును విరోధసందర్భములని యర్థము, జెప్పినన్=చెప్పినయెడల, వారిద్దరికింబగలే=ఆరెండిండ్లవారికిని విరోధములు, పొక్కినన్=రేగియెక్కువయైనయెడల, కలచేడియలు=నిన్నె ఱిగిన యాడువాం డ్రందరును, అమ్మక్కయని=గడ్డంమీద చేతులునైచు కొని ఏమమ్మో ఏమక్కయో ఏమెుదినో యిదుమళ్ళమాఱిదినుమా యను కొందురు.

తా. తగవు సంబంధమైనవారిమాటలు వీరికి వీరిమాటలు వారికి చెప్పి నచో వారికి విరోధములు నీమూలముగా వచ్చి వినిన యాడువాండ్రందరు ను తగవులకోరని నిన్ను నిందింతురు.

క. తలవాకిట నెల్లప్పుడు
నిలువఁగ రాదెప్పుడెంత • నిద్దురయైనన్
మెలఁకువ విడరాదు సుమీ
తలనడచుచు విప్పికొనుట తగదు కుమారీ. 41

టీ. కుమారీ! తలవాకిట=వీధిగుమ్మంలో, నెల్లప్పుడు=ఎప్పుడును, నిలు వగన్=నిలువబడ, రాదు=కూడదు, ఎప్పుడెంతనిద్దురయైనన్=యెంతనిద్దుర యేసమయమునవచ్చినను, మెలకువన్=తెలివిని, విడరాదు=వదలఁగూడదు, తలన్=జుట్టును, నడచుచు=విప్పికొనుట విరియబోసికొనుటగాని పనిలేకనే విప్పి ముడివైచుకొనుటగాని, తగదు=కూడదనిపని.

తా. వీధిగుమ్మమువద్ద నిలుచుట మెలుకువలేక గాఢనిద్రపోవుట మార్గ మందు తలవిప్పుట కూడనిపనులు.

క. వారికిని వీరికిఁ గలిగెను
గోరివస్తువులు మాకుఁ • గొదవాయె నటం
చూరక గుటకలు మ్రింగుట
నేరముగాఁ దలఁపవలయు • నెలత కుమారీ. 42

టీ. కుమారీ! నెలత=కాంత, వారికి=వీరికినిఁ, గలిగెన్=ఉన్నవి,

కోరినవస్తువులు, మాకు, గొదవాయెన్=లేకపోయెఁగదా, అటంచున్=అని, ఊరక=లాభము లేనిదానికొరకై, గుటకలుమ్రింగుట=ఆసజెందుట, నేరము గా=తప్పుగా, తలఁపవలయు=యెంచుకొనవలయును.

తా. వారికి వీరికి నగలున్నవిగదా నాకు లేవు అని విచారించుట వ్యర్థము నీపూజ మంచిదైనచో దైవము నీకును అట్టిభాగ్యమిచ్చును.

క. కొన్నాళ్లు సుఖము కష్టము
కొన్నాళ్లు భుజింపకున్న • గొఱగాదు సుమీ
పున్నమ దినముల వెన్నెల
యెన్నంగ నమాసలందు నిరులు కుమారీ. **43**

టీ. కుమారీ! కొన్నాళ్లు=కొంతకాలము, సుఖము=సౌఖ్యము, కొన్నాళ్లుకష్టము=కొంతకాలముకష్టమును, (ఉండుటస్వభావము) భుజింపకున్నన్=తిండితినకున్నను, కొఱతఁగాదుసుమీ=కష్టముగాదు, ఎన్నంగన్=ఆలోచింపఁగా, ప్రకృతిలో నిట్టిస్వభావమున్నది, పున్నమదినములన్=శుద్ధవిదియమొదలు, వెన్నెల=చంద్రకాంతియును, అమాసలందు=బహుళ విదియ మొదలు, ఇరులు=చీకటియును కలుగును.

తా. కొన్నాళ్లు వెన్నెల కొన్నాళ్లు చీకటియెట్లు స్వభావమో అట్లే మనకును కష్టసుఖములు కావడికుండలవంటివి గాన నీకు లేమి సంభవించినను కష్టముగా నెంచుకొనక నోపికపట్టితివేని సుఖమొనగూడును.

క. పొంతబనిఁ జేయ కెన్నఁడు
పంతంబులు వలుకఁబోకు • ప్రాఙ్ముఖముగ నీ
దంతంబులు దోమకు మే
కాంతంబులు బయలు పరుప • కమ్మ కుమారీ. **44**

టీ. కుమారీ! ఎన్నఁడున్=ఏనాఁడును, పొంతబని=[illegible]టిపని, చేయకు=నేయరాదు, పంతంబులు=తగవుపెరుగుబీరంబులు, [illegible]కఁబోకు=ఆఁడకు

ము, ప్రాఙ్ముఖముగన్=తూర్పుదిశగా, నీదంతంబులు=నీపళ్లు, తోమకుము తోమరాదు, ఏకాంతంబులు=రహస్యములు, బయలుపలుపకు=ఎవ్వరికిని తెలియనీయకుము.

తా. కొద్దిపనిఁజేసి పెట్టియుంచకుము యితరులతో తగవుమాటలాడకుము సూర్యునిమొగంబై మొగముం గడుగకుము నీరహస్యమును వెల్లడింపకుము.

క. నడకలలో నడుగుల చ
ప్పుడు వినబడకుండ వలయు ♦ భువి గుంటలు క
న్పడరాదు మడమ నొక్కులఁ
బడఁతులమర్యాదలెఱిఁగి బ్రతుకు కుమారీ. 45

టీ. కుమారీ! నడకలలోనన్=తిరుగునప్పుడు, అడుగులుచప్పుడు=పాదములధ్వని, వినఁబడకుండవలయున్=వినబడకుండగా మెల్లగానడువవలెను, మడమనొక్కులన్=పాదముపూర్తిగా నేలమోపినప్పుడు, గుంటలు=చొట్టలు, కన్పడరాదు=వచ్చునట్లు అడ్డదిడ్డముగా నడవక జాగ్రతగా నడవవలెను, పడతులమర్యాదలు=స్త్రీల నడతలు, ఎఱిఁగి=తెలిసి, బ్రతుకుము=జీవించవలయును.

తా. మెల్లగా చీమయైనను కాలిక్రిందఁ బడినచో చావనట్లు నడువవలయును. స్త్రీల నడవడి యెట్లో పెద్దలవలనఁ దెలిసి వర్తింపవలయును.

క. నవ్వంగరాదు పలుమరు
నవ్విన జిఱునవ్వుగాని నగరాదెపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వన గానంగఁబడెడి ♦ జాడఁ కుమారీ. 46

టీ. కుమారీ! పలుమరు=ఎల్లప్పుడు, నవ్వంగరాదు=నవ్వఁదగదు, నవ్వినన్=నవ్వినచో, చిఱునవ్వుగాని=సంతోషము ముఖమున కనుఁబడునంతే

గాని, ఎపుడున్=ఎప్పుడును, దంతంబులు=పలువరుస, గవ్వలవలెన్=అంత యు, జవ్వన=ఒకేసారి, కానఁబడెడిజాడన్=కానవచ్చునట్లుగా, నగ రాదు=నవ్వబోకుము.

తా. నవ్వు నాల్గువిధములఁ జేటనుపూర్వోక్తి తెలిసికొని పనిగల్గిన పుడు చిరునవ్వు నవ్వవలెను గాని పకాలుమని యికిలించఁగూడదు.

క. తొడవులు మిక్కిలి గలిగినఁ
కడుఁ బ్రేమన్ మగఁడుమిగుల ♦ గారామిడినన్
బడఁతుక పసుపుం గుంకుమ
గడియైనను విడువరాదు ♦ గాదె కుమారీ. 47

టీ. కుమారీ ! తొడవులు=నగలు, మిక్కిలి=ఎక్కువ, కలిగినన్=ఉన్న ను, కడు ప్రేమన్=ఎక్కువ ప్రీతితో, మగఁడు=పెనిమిటి, మిగులన్=తుల లేని, గారాము=అనురాగము, ఇడినన్=చూపినను, పడఁతుక=వనిత, పసు పుకుంకుమ, గడియైనన్=క్షణమైనను, విడువరాదుగాదె=ఉంచుకొనకుండ రాదునుమా.

తా. నగలెన్నియున్నను భర్త యెంతప్రీతితో జూచినను పసపుకుం కుమలుమాత్ర మెప్పుడును ధరించుట మరువరాదు.

క. చెడుగులతో లంజెలతో
గుడిసేటులతోడఁబొత్తు ♦ కూడదు మది నె
ప్పుడు నిల నుత్తమ కాంతల
యడుగుల కున్మడుగు లొత్తు ♦ మమ్మ కుమారీ. 48

టీ. కుమారీ ! చెడుగులతోన్=దుర్జనతగలవారితో, లంజలతోఁ= వ్యభిచారులతో, పొత్తు=సాహవాసము, కూడదు=పనికిరాదు, మదిన్= ఆత్మయందు, ఎప్పుడున్=ఎన్నడును, ఇలన్=భూమిపై, ఉత్తమకాంతల= గుణవతులైనస్త్రీలయొక్క, అడుగులన్=చరణములకు, మడుగులొత్తు మమ్మ=పూజింపుము.

తా. వ్యభిచారులతోను దొంగతనములు సేయువారిలోను అబద్ధము లాడువారితోను స్నేహముసేయక పతివ్రతల పాదములఁ బూజించిన మే లగును.

క. విసువగు పని తగిలినయెడ
గసరకు సేవకుల మిగులఁ • గాంతుని తోడన్
రొసరొస బూనకు మాడకు
మసత్యవచనంబు లెన్న • డైన కుమారీ. 9

టీ. కుమారీ ! పనితగిలినయెడన్=పనియున్నప్పుడు, విసువకు=చిరాకు పడకుము, సేవకులన్=నౌకరులను, మిగులన్=మిక్కిలి, కసరకు=కోపపడకు, కాంతునితోడన్=పతితో, రుసరుసబూనకు=విరోధపడకుము, ఎన్నఁడైనన్=ఏనాఁడును, అసత్యవచనంబులు=అబద్ధములు, ఆడకుము=చెప్పకుము.

తా. ఏదయినం బనియున్నపుడు విసుగుగొనరాదు నీపరిచారికలను తిట్టకుము మగనితో కలహింపకుము ఏనాడును అబద్ధమాడకుము.

క. వేళాకోళంబులు, గ
య్యాళితనంబులును జగడ • మాడుటలును గం
గాళీ పోకలు కొండెము
లాలోచించుటయుఁ గూడ • దమ్మ కుమారీ. 50

టీ. కుమారీ! వేళాకోళంబులు=నవ్వులాటలు, గయ్యాళితనంబులును=కసరినట్లు మాటలాడుటయును, జగడమాడుటలును=తగవులాడుటయును, గంగాళీపోకటలు=నక్కజిత్తులును, కొండెములాలోచించుటయు=చాడీలుకల్పించుట, కూడదు=మంచిపనులుగావు.

తా. వేళాకోళములాడుట కసరుట చాడీలుజెప్పుట మాయమాటలాడుట తగవు పెంచుట యీమొదలైనపనులు ఉత్తమస్త్రీకి లక్షణములుగావు.

క. బంతులను బక్షపాత మొ
కింతైనను జేయరాదు • హీనదశల సా

మంతుల నొక భంగినిరీ

క్షింతువు బుధులెల్ల సంత ♦ సిల్ల కుమారీ. 51

టీ. కుమారీ ! బంతులను=భోజనముల సేయుటకు వచ్చి కూర్చున్నవారిలో, పక్షపాతమొకింతైన=ఒకరిని ప్రేమగా మఱియొకరిని ప్రేమలేనట్లుగా జూచి యొకరికెక్కువ మఱొకరికి తక్కువ వడ్డించుట తగదు, హీనదశుల=పేదవాండ్రను, సామంతులనొ=ఐశ్వర్యవంతులను, ఒక్కభంగిన్=సమాన గౌరవముగా, నిరీక్షింతువు=చూతువుగాక, బుధులెల్లన్=యోగ్యులందరును, సంతసిల్ల=అట్లుచేసిన సంతోషింతురని యర్థము.

తా. వరుసగాకూర్చున్న వారికేదేని నీవు వడ్డించవలసివచ్చినచో భాగ్యవంతులని స్నేహితులని వారి కెక్కువ విరోధులని పేదవాండ్రని వారికి తక్కువ వడ్డించినఁ బాపమగును అట్లుగాక నందరిని సమబుద్ధితో జూచినట్లయిన బుద్ధిమంతులు సంతోషింతురు.

క. మాసిన తలమాసిన యిలు

మాసిన వలువలు దరిద్ర ♦ మార్గంబులు నెం

తేసి ధనవంతులైనను

గాసిల్లుదు రల్ప దశల ♦ గ్రాగి కుమారీ. 52

టీ. కుమారీ ! మాసినతల=మురికితల, మాసినయిలు=పాచియిల్లు, మాసినవలువలు= మాసినబట్టలు, (ఇవన్నియు) దరిద్రమార్గంబులు=అనారోగ్యమునకు మార్గమయి అయనారోగ్యమే ధననాశనమునకు మూలము, ఎంతేసి=గొప్పధనవంతులైనను, గాసిల్లుదురు=అల్పదశలవలన బాధపడుటకు యిట్టివను లే కారణములు.

తా. బట్టలు తల యిల్లు అపరిశుభ్రముగా వుండరాదు యెప్పుడు పరిశుభ్రముగా నుంచవలయును అట్లుంచనిచో అనారోగ్యము దరిద్రము సంభవించి విచారపడవలసివచ్చును.

క. సన్నెకలున్ బాత్రమ్మును
దన్నక పోరాదు కాల ♦ దగిలినయెడలన్
కన్నుల నద్దుకొనవలె
గ్రన్నన సిరియందు నిలుచుఁ ♦ గాన కుమారీ. 53

టీ. కుమారీ ! సన్నెకల్లును, పాత్రమును, తన్నకపోరాదు కాలు వాటికి తగులనీయరాదు, అందున్=వానియందు, సిరి=లక్ష్మీదేవి, నిలుచుఁగానన్=ఉండునుగనుక, కాలన్=కాళ్ళనుతగిలినచో, గ్రన్ననన్=తొందరగా, కన్నులను, అద్దుకొనవలెను.

తా. సన్నికల్లుపాత్రము, యీ రెంటియందును సిరిగలదని పెద్దలు చెప్పుదురు గాన జాగ్రత్తగా కాలు తగలనీక పొరపాటున తగిలినచో పశ్చాత్తాపపడవలెను.

క. దీపము వెలిఁగించెడిచో
జీపురుపుడకుంచ వలయుఁ ♦ జేతులనంటన్
బాపము పాలౌదువు మది
లోపల నిది తలఁపవలయు ♦ రూఢిఁ గుమారీ. 54

టీ. కుమారీ ! దీపము వెలిగించినచోన్=ఒకదీపమున నీదీపము వెలిగింపవలసి వచ్చినచో, చీపురుపుడకుంచవలయున్=చీపురుపుడక గాని అట్టిమరే తాటాకైనగాని వెలిగించి బుడ్డి ముట్టించవలెను, (అంతేగాని) జేతులచేత నీచేతిలో బుడ్డితో ఆబుడ్డిఅంటించినచో, పాపముపాలౌదు=పాపమని బుధులందురు, మదిలో నిది మరువవలదు.

తా. ఒకదీపముచేత నీదీపము ముట్టింపక ఏపుల్ల వెలిగించిగాని తాటాకుసంబంధమైన దానిచేతగాని వెలిగించుము.

క. సరకుల యెడ జాగ్రత్తయుఁ
జూరుకు పనులయందు భక్తి ♦ సుజనుల యందున్

గరుణ యనాథుల యెడలం
దరుణికిఁ జెలువార వలయు ♦ ధరణి కుమారీ. 55

టీ. కుమారీ ! ధరణిన్=భూమిమీద, తరుణికిన్=ఆడుదానికి, సరకుల యెడన్=యింటిలోసామానులయందు జాగ్రత్తయున్=నావస్తువులుగదాపో నీయరాదనునాసక్తియు, పనులయందున్=పనులలో, చురుకు=వేగము, సుజనులందుఁ=గుణవంతులయందు, భక్తి=వినయమును, అనాథులయెడన్=బ్రతుకఁదెఱువులేనివారలయందు, కరుణ=అనురాగమును, జెలువార వలయున్=మిక్కిలిగా నుంచుకొనవలయును.

తా. వస్తువులందు మఱపులేకుండుటయు పనులందు శీఘ్రమును గుణవంతులందుభక్తియు పేదలయెడఁ కనికరము ఎక్కువగా నుండవలెను.

క. చెప్పినఁ జెప్పక యుండినఁ
దప్పక సేయంగవలయు ♦ దన పనులెల్లన్
మెప్పొదవగాను లేదా
ముప్పొదవును గాదె యెందు ♦ ముద్దు కుమారీ. 56

టీ. కుమారీ ! చెప్పినన్=బోధించినను, చెప్పకయుండినన్=బోధింపకున్నను, తనపనులెల్లన్=నీపనులన్నియును, మెప్పొదవన్=ఒరులు సంతోషించునట్లుగా, తప్పక, సేయవలెన్=సేయుము, అట్లుసేయనిచో, ఎందున్, ముప్పొదవుఁగాదె=కష్టము ప్రాప్తించును.

తా. ఒకరు చెప్పినను లేకున్నను నీవలన కావలసిన పనులన్నిటిని ప్రజలు సంతసించునట్లు సేయకున్నచో నీకే కష్టముగలుగును.

క. ఎంగిలి పరులకు, బెట్టకు
కంగున మ్రోయంగనీకు ♦ కాల్మట్టియలన్
బంగారు లాభముండిన
దొంగతనము సేయు బుద్ధి ♦ దొలఁగు కుమారీ. 57

టీ. కుమారీ! పరులకున్=ఇతరులకు, ఎంగిలి=నీవు తినగామిగిలినది, పెట్టకు, కంగున=గంటవలె, మ్రోయంగనీకు=శబ్దము వినబడనీకు, బంగారు=బంగారము, లాభముండినన్=దొరుకునప్పుడైన, దొంగతనము సేయు బుద్ధి=దొంగబుద్ధి, తొలగు=మానుము.

తా. నీయెంగిలి నెవ్వరికిం బెట్టకుము మట్టెలమ్రోత వినఁబడునట్లు నడువకుము బంగారమైనను దొంగతనము సేయకుము.

క. ఆపదలకోర్చి సంపద
లాపయి భోగింపుమనెడి ♦ హర్షోక్తుల నీ
లోపలఁ దలచుచు లాంతరు
దీపము చందమున వెలుఁగ ♦ దివురు కుమారీ. 58

టీ. కుమారీ! ఆపదలకున్=కష్టములకు, ఓర్చి=ఓపికఁబట్టి, ఆపయిన్=తరువాత, సంపదలు=సౌఖ్యములు, భోగింతురు=పొందుదురు, అనెడి హర్షోక్తుల్=అనుసంతోషపుఁబలుకులు, నీలోపలన్=నీమదిలో, తలచుచున్=అనుకొనుచు, లాంతరుదీపముచందమున్=లాంతరునఁగలదీపమట్లు, వెలుగన్=దీపించుటకై, తిరువు=యోచింపుము.

తా. చలించని లాంతరులోఁ దీపమట్లు ముందుకష్టపడినను తరువాత సుఖింతునుగదా యని చలింపకుండుము.

క. తనకడుపు కట్టుకొనియై
నను జుట్టమునకును బెట్టి ♦ నను గీర్తి వహిం
చును భుక్తిముక్తులబ్బును
దనకెవ్వరు సాటిరారు ♦ ధరణి కుమారీ. 59

టీ. కుమారీ! ధరణిన్=ఇలపై, స్త్రీ=ఆడుది, తనకడుపు, కట్టుకొనియైనను=ఆకలినాపియైనను, చుట్టమునకున్=నీయింటికివచ్చిన యెవనికైన

ను, పెట్టినను=పెట్టినచో, కీర్తి=మంచిదనుమాట, వహించును=నందును, భుక్తిముక్తులు=ఇహపరసౌఖ్యములు, అబ్బును=పొందవచ్చును, అప్పుడు, తనకు యెవ్వరు సాటిరారు.

తా. నీవు కష్టమున నాకలికట్టుకొనియైనను నీయింటికి అన్నముకొఱకు వచ్చినవానికి పెట్టితివేని మంచిపేరీ లోకమందును పరమందు సౌఖ్యమును వచ్చును.

క. వడిదనిపించు కొనుటకున్
గడియైనను బట్టుకుండుఁ ♦ గాంతలలో నె
క్కుడు గుణవతి యనిపించెడు
నడవడి నేర్పుటయె కడు ఘ ♦ నంబు కుమారీ. 60

టీ. కుమారీ! చెడుగు=దుర్నడతగలది, అనిపించుకొనుటకున్=అను మాటలోకులచే పొందుటకు, గడియయైనను, బట్టదు, కాంతలలోన్, ఎక్కుడుగుణవతి=చాలామంచిది, అనిపించెడినడవడిన్ = అనిపించుకొనుట, కడున్=ఎక్కువ, ఘనంబు=కష్టము.

తా. దుర్మార్గులనుమాట ఒక్కఘడియలో వచ్చును గాని మంచి దనిపించుకొనుటమాత్రము చాలాకష్టము.

క. చెప్పకు చేసినమేలు నొ
కప్పుడయినఁగాని దాని ♦ హర్షింపరుగా
గొప్పలు చెప్పిననదియును
దప్పేయని చిత్తమందు ♦ దలఁపు కుమారీ. 61

టీ. కుమారీ! చేసినమేలు=నీవుచేసినయుపకారము, ఒకప్పుడైనను, చెప్పకు=చెప్పరాదు, దానిన్=ఆసంగతిని, హర్షింపరుగా=మంచివారు, సంతోషింపరు, గొప్పలు=బడాయి, చెప్పినన్=పల్కినచో, అది మఱి యుదప్పని, చిత్తమందున్=మదిలో, తలంపు=యెంచుకొనుము.

తా. ఒకరికేదేని యిచ్చినను భోజనము పెట్టినను యెవ్వరితోను జెప్ప వలదు అట్లుచెప్పిన పెద్దలు హర్షింపరు బడాయిలు చెప్పినచో నీచురాలు అనికూడ నందురు.

క. ఎంతటి యాఁకలిగలిగిన
బంతిని గూర్చుండి ముందు ♦ భక్షింపకు సా
మంతులు బంధువులును నిను
మంతైనను జెల్లదందు ♦ రమ్మ కుమారీ. 62

టీ. కుమారీ! ఎంతటియాకలి కలిగినన్=ఎంతయాకలియైనను, బంతినిఁ గూర్చుండి=పదిమందితో భోజనమునకు గూర్చుండినప్పుడు, ముందు, భుజింపకు=భోజనము సేయకుము, సామంతులు=కలవారును, బంధువులును, యినుమంతయైనను=యించుకైనను, చెల్లదు=తగదు, అందురు.

తా. పంక్తిలోఁ గూర్చుండినప్పు డెంతయాకలియైనను ముందు తిన రాదు అట్లు తినినచోఁ గొందరు తిండిపోతనియు మఱికొందరు చెడ్డదనియు నందురు.

క. అధికారము లేని పనుల
కధికారము సేయఁబోకు ♦ మందునఁ గోపం
బధికంబగు నీవారికి
బుధులది విని హర్ష మొందఁ ♦ బోరు కుమారీ. 63

టీ. కుమారీ! అధికారములేనిపనుల్=నీమాటచెల్లని పనులకు, అధికారము=పెత్తనము, సేయఁబోకు, అందునన్=అట్లయినచో, నీవారికిన్=నీభర్త మొదలైనవారలకు, కోపము, అధికంబగున్=ఎక్కువయగును, బుధులు=పెద్దలు, అదివిని, హర్షమ్ము=సంతసము, ఒందంబోరు=పడరు.

తా. నీకు పెత్తనము లేని యేవిషయమునకును పెత్తనము చెలాయించి తివేని పెద్దలునవ్వుదురు నీవవమాన మందుదువు.

క. తానమ్ముడు వడిరైయెనన్
దీనుండగు ధవుని యార్తిఁ ♦ దీర్చుటసతికిన్
మానము చంద్రమతీజల
జానన దేఁపోయావలయు ♦ నాత్మ కుమారీ. 64

టీ. కుమారీ! తానమ్ముడువడిరైయెనన్ = తానొకరిచే కొనఁబడిరైయెనను దీనుండు, అగుధవునియార్తి = భర్తకష్టము, తీర్చుట = పోగొట్టుట, సతికిన్ = భార్యకు, మానము = ఘనత, ఆత్మన్ = మనస్సుచేతజూచినచో, చంద్రమతీజలజానన = హరిశ్చంద్రునిభార్య యగుచంద్రమతి జ్ఞప్తివచ్చును.

తా. తానమ్ముడు పడి గాని యొకరికూడిగముఁ జేసి గాని మగని బాధ తొలంగజేసినదే సహధర్మిణి అట్టిదొక చంద్రమతీదేవియే గాన నీవును అట్టిదానవై యదృష్టమున్నచో పేరుఁ దెచ్చుకొనుము.

క. తనకంటెఁ బేదరాండ్ర
గని యంతకుఁ దనకుమేలు ♦ గాయనవలయున్
దనకంటె భాగ్యవంతుల
గని గుటకలు మ్రింగ మేలు ♦ గాదు కుమారీ. 65

టీ. కుమారీ! తనకంటెన్ = తనకన్న, పేదవాండ్రన్ = బీదవాళ్ళను, గని = చూచి, అంతకున్ = అంతకంటె, తనకున్ = తనకు, మేలుగా = ఎక్కువగా, అనవలయున్ = తలచవలెను, తనకంటెన్, భాగ్యవతులన్ = ధనవంతురాండ్రను, కని, గుటకలుమ్రింగన్ = ఓర్వలేకుంట, మేలు = మంచిగాదు.

తా. తనకన్న పెద్దవారిసైనను మంచివారుగా ధనవంతులుగా గొప్పగా జూడవలెను తనకన్న సంపన్నులంజూచి అయ్యో వారికుండె నేయని విచారింపక సంతసింపవలయును.

క. విఱుగబడి నడువఁ గూడదు
పరుల నడకలెన్ని తప్పు ♦ పట్టఁ జనదు ని
ష్ఠురములు వచింపఁ గూడదు
కఱపఁగవలె మేలు మేలు ♦ గలదు కుమారీ. 66

టీ. కుమారీ! విరుగన్ బడి=గర్వించి, నడువఁగూడదు=సంచరింపరాదు, పరులనడకలెన్ని=యితరులనడకలనెంచి, తప్పుపట్టజనదు=ఆక్షేపింపగూడదు, నిష్ఠురములు=నిందలు, వచింపఁగూడదు=అడఁగూడదు, మేలు తనకుఁ దోఁచినంతవరకు, కఱపగవలెన్=నేర్పవలయును, మేలు=లాభము, అందువలనఁగలదు=వచ్చును.

తా. వళ్లు విఱచుకొని గర్వముగా నడువరాదు ఒరులు అట్లు నడచిన నీవధిక్షేపింపక తెలిసినంతవరకు మంచి నడత నేర్పినచో మేలగును.

క. కోపమున నప్పుడాడని
రూపించిన మాటకొన్ని ♦ రోజులు చనినం
జూపట్టదనుచు శాంతము
లోపలఁ గొనవలయు ధర్మ ♦ లోల కుమారీ. 67

టీ. కుమారీ! కోపమునన్=కోపమువలన, అప్పుడాడన్=అప్పుడన, నిరూపించినమాట=దలంచుకొనినమాట, కొన్నిరోజులు చనినన్=కొన్నాళ్లెగినతరువాత, జూపెట్టదనుచు, శాంతము లోపల=మనస్సులో, గొనవలయు=ఉంచుకోవలయును.

తా. అపరిమితమయిన కోపముగల్గి యప్పుడనుకొనవలసిన యాటయైనను కొన్నాళ్ళు గడచిన వెనుక ననవచ్చునని తలంపుము.

క. కలహాపడు నింట నిలువదు
కలుముల జవరాలు గానఁ ♦ గల కాలం బే

కలహములు లేక సమ్మతి
మెలఁగంగా నేర్చినేని ♦ మేలు కుమారీ. 68

టీ. కుమారీ! కలుములజవరాలు=లక్ష్మీదేవి, కలహపడునింట నిలు వదు=తగవులాడుయింటనుండదు, కానన్=కనుక, కలకాలము=జీవితకాలము, ఏకలహములు=ఏపోట్లాటలు, లేక, సమ్మతిఁగ=హితవుగా, మెల గంగా=తిరుగుట, నేర్పదవేనిన్=నేర్చుకొన్నచో, మేలు=మంచియగును.

తా. లక్ష్మీదేవి తగవులాడు యింటనుండదుగాన నీయింటిలోనెవ్వరు పోట్లాడకుండ సేయు బాధ్యతనీదైనచో నెన్నడు లక్ష్మీవంతురాలుగా నుండెదవు.

క. గురు శుక్రవారముల మం
దిరగేహళులందు లక్ష్మి ♦ తిరముగ నిలుచుం
గరగరిక నలికి ముగ్గిడి
గురభక్తి మెలంగఁ బాయుఁ ♦ గొదువ కుమారీ. 69

టీ. కుమారీ! గురుశుక్రవారముల, మందిరగేహళులందున్=ఇంటి గుమ్మములయందు, లక్ష్మి, తిరముగ=మనమునైచికొని, నిలుచుఁగ=ఉండును, గాన, గరికరికన్=శుభ్రముగా, అలికిముగ్గిడి, గురుభక్తిన్=పెద్దలయందు భక్తిచేత, మెలఁగన్=తిరిగినచో, కొదువబాయన్=లోటెన్నడు గలుగక ఐశ్వర్యప్రదముగా నుండును.

తా. శుక్రవారము లక్ష్మివారము యిల్లు శుభ్రపరచి గడపలకుఁ బసుపుకుంకుమలు వ్రాసి పెద్దలయందు భక్తితోనున్న యింట తప్పక లక్ష్మి యుండును.

క. అపకీర్తిం బొందుటకే క
ష్టపుఁబని గాదొక్క గడియ ♦ చాలునుగీర్తి

నిపుణత వహింపవలయును
జపల గుణము లెల్ల బాసి ♦ చనగ కుమారీ 70

టీ. కుమారీ ! అపకీర్తిన్=చెడువాడుకను, బొందుట, కష్టపుపని, కాదు, ఒక్కనిమిషముపట్టును, చపలగుణము=చాదస్తమును, ఎల్లఁబాసి=అంతయువిడిచి, చనఁగన్=పోవఁగా, కీర్తి=మంచిపేరు, నిపుణతన్=జాగ్రతతో, వహింపవలయున్=తెచ్చుకొనవలయును.

తా. చెడుపేరు సంపాదించుటకు క్షణముపట్టదు. చాందసపు గుణములన్నియు వదలి జాగ్రతగా నడచినంగాని మంచిపేరు రాదు.

క. సరకులు బట్టలు వన్నెల
కెరవులు తేఁదగదు తెచ్చె ♦ నేని సరకు ల
క్కర దీర్చుకొనుచు వెంటనె
మరలింపకయున్నఁ దప్పు ♦ మాట కుమారీ. 71

టీ. కుమారీ ! సరకులు=నగలు, బట్టలు=వస్త్రములు, వన్నెలకు=డంబాచారముకొఱకు, ఎరవులు, యితరులను మరలయిచ్చెదమని, తేఁదగదు=పుచ్చుకొనరాదు. తెచ్చెనేని=ఒకవేళ తెచ్చినచో, సరకులు=వారి సంబంధమైనయేవస్తువునైనను, అక్కర=అవుసరము, తీర్చుకొనుచు=తీరినతక్షణము, మరలింపకయున్నఁ దప్పుమాఁట=యిచ్చివేయనిచో మరెన్నడును యివ్వరు.

తా. బడాయికి యొవరినగలను బట్టలనుయెరవు తేఁకూడదు. నీకున్న దొక ముక్కుపుల్లకంటె యెరవుకానుల పేరయినను గౌరవముగాదు. ఒకవేళ తెచ్చినను వెంటనే యిచ్చివేయకున్నచో చాలకష్టములున్నవి.

క. గొప్పదశ వచ్చెననుచు నొ
కప్పుడయిన గర్వపడకు ♦ మదిదొలగినచో
జప్పట్లు చఱతురందఱు
దప్పని దండించు దండ్ర ♦ ధరుఁడుకుమారీ. 72

టీ. కుమారీ! గొప్పదళ=ఐశ్వర్యము, వచ్చెననుచున్=కలిగెనని, ఒకప్పుడయినన్=ఎన్నఁడును, గర్వపడకుము, అదిదొలఁగినచో=అదళపోయినచో, అందఱుఁ, చప్పట్లుచరతురు=నవ్వుదురనియర్థము, తప్పని, దండధరుఁడు=యముఁడు, దండించుఁ=శిక్షవిధించును.

తా. అదృష్టముచే నీకు భాగ్యముగలిగినయెడ వందనము దప్పినడచితివేని యాయైశ్వర్యము పోయినప్పుడెల్లరును నవ్వుదురు యముడు దండించును.

క. సుమతియును చంద్రమతియును
దమయంతియుఁ జానకియును ♦ ద్రౌపదియును బ
న్నములంబడి పతిభక్తిం
క్రమమున నడపుటలు తలవఁ ♦ గాదె కుమారీ. 73

టీ. కుమారీ! సుమతియును=సుమతీదేవియును, చంద్రమతియును, దమయంతియు, జానకియును=సీతయును, ద్రౌపదియు, బన్నములంబడి=కష్టములఁబడి, క్రమమునన్=యెప్పటియట్లు, పతిభక్తిన్=భర్తసేవ, నడపుటలు=నడపుట, దలఁపఁగాదె=తలపుసేయుము.

తా. సుమతీదేవి సీతాదేవి దమయంతి చంద్రమతి ద్రౌపది సావిత్రి మొదలగు పతివ్రతలెంతెంత కష్టములైన నోర్చి పతిభక్తి నెట్లుగడపిరో యెంచుకొని నీవట్లు సేయఁ బ్రయత్నింపుము.

క. సుమతియను రమణి పతికై
శ్రమనొందుట నీచసేవ ♦ సలుపుటయు వియ
ద్గమన నిరోధము భానున
కమరించుటయుం దలంపు ♦ మాత్మ కుమారీ. 74

టీ. కుమారీ! సుమతియనురమణి=సుమతీదేవి, పతికై=భర్తకొఱకు, శ్రమన్=కష్టము, ఒందుట=పడుట, నీచసేవసలుపుటయు, భానునకున్=

సూర్యునికి, వియద్గమననిరోధము=ఆకాశమునందు తిరుగకుండ, (ఉద
యించకుండ) ఆదరించుటయున్=చేయుట, ఆత్మన్=మనస్సులో, తలం
పుము=ఆలోచించుకొనుము.

తా. తనభర్త తన్నెంత బాధించినను మనసులో నుంచుకొనక భర్త
కోర్కెదీర్చుటకై వేశ్యకు దాస్యముజేసి భర్తప్రాణములు పోవునను భయ
ముచే సూర్యోదయముకూడ కాకుండ జేసినది తుదకు తనభర్తను బ్రతికిం
చుకొనినది భక్తి భర్తయందుండెనేని నీవును అంత సమర్థురాల వగుదువు.

క. వాణియు శర్వాణియు హరి
రాణియు వాక్కునను మైను ♦ రంబున నుంటల్
రాణఁ దిలకించి మదిలో
బాణిగ్రాహియెడ నిల్పు ♦ భక్తి కుమారీ. 75

టీ. కుమారీ! వాణియున్=సరస్వతియును, శర్వాణియున్=పార్వతి
యును, హరిరాణియున్=లక్ష్మియును, క్రమముగా వాక్కునను=మాటయం
దును, మైన్=శరీరమందును, ఉరంబునన్=గుండెలపైని, ఉంటల్=ఉం
డుటలు, మదిలోన్=ఆత్మలో, రాణన్=ప్రీతితో, తిలకించి=చూచి,
పాణిగ్రాహియెడన్=మగనిపై, భక్తిన్=భక్తిని, నిల్పు=ఉంచుకొనుము.

తా. సరస్వతీ వాక్కునందును పార్వతి శరమందు సగభాగమునను
లక్ష్మివక్షమందును ఉండి ఎప్పుడునుఁ బాయక సేవలుసేయు టెఱిఁగి నీవు
ను అట్లేబాయక సేవసేయుచుండుము.

క. వడ్డించునపుడు తాఁగను
బిడ్డనికిం దల్లిభంగిఁ ♦ బ్రేమ దలిర్పన్
వడ్డింపవలయు భర్తకు
నెడ్డతనము మాన వలయు ♦ నెందు కుమారీ. 76

టీ. కుమారీ ! వడ్డించునపుడు= భోజనము పెట్టునపుడు, తాన్= తాను, కనుబిడ్డనికిన్= కన్న కుమారునకు, తల్లిభంగిన్=తల్లియట్లు, ప్రేమ దలిర్పన్= ప్రీతితో, భర్తకున్=పతికి, వడ్డింపవలయును, ఎందుఁ= యేపనిలోను, ఎడ్డెతనము=మడ్డితనము, మానవలయున్=వదలవలెను.

తా. కన్నకుమారునకెంత ప్రీతితో వడ్డింతువో అట్లే నీమగనికిని వడ్డింపవలెను. మందముగా నుండక తెలివిగా నుండుము.

క. పవళించు నపుడు రంభా
కువలదయనేత్ర భంగిఁ ♦ గోరిన రీతిన్
ధవుని కొనఁగూర్ప వలయును
దివి భువినుతిఁ బొందునట్టి ♦ తెఱవ కుమారీ. 77

టీ. కుమారీ ! పవళించునపుడు=కేళీగృహమున, రంభాకు వలయదళనేత్రభంగిన్=రంభయను పేరుగల యప్సరసవలె, కోరినరీతిన్= భర్తయిష్టప్రకారము, ధవునకున్=పతికి, ఒనగూర్పవలెన్=సౌఖ్యము గలుగఁజేయవలెను, అట్టి తెఱవ=అట్లునడచినకాంత,దివిన్=స్వర్గలోకమున, భువిన్=భూమిపై, నుతిన్=గౌరవమును, పొందును=అందును.

తా. కేళియందు రంభవలెఁ బతి యిష్టప్రకారము విని యాతని సంతోష పెట్టినచో నిహపరసౌఖ్యములు రెండును గలుగును.

క. ఆలోచన యొనరించెడి
వేళలలో మంత్రి భంగి ♦ వివరింపవలెం
గాలోచిత కృత్యంబుల
భూలోకమునందు గీర్తిఁ బొందు కుమారీ. 78

టీ. కుమారీ ! ఆలోచన మొనరించెడివేళలన్=కార్యాలోచనా సమయమున, కాలోచితకృత్యములన్=కాలానుసారమైనకార్యములందు, మంత్రిభంగిన్=ప్రధానివలె, వివరింపవలెన్=మంచియోచన, జెప్పవలెను.

(అట్లుచేసిన) భూలోకమునందున్=జనులలో, కీర్తిన్=పొగడ్తను, పొందున్=గడించును.

తా. పతికేదేని కార్యాలోచనలో మంత్రివలె మంచియాలోచన చెప్పినకాంతనెల్లరును గొనియాడుదురు.

క. పనిసేయు నప్పుడు దాసీ
వనిత విధంబునను మేను ♦ పంపఁగ వలయున్
ధనవంతుల సుతయైనను
ఘనత గలుఁగు దానివలనఁ ♦ గాదె కుమారీ. 79

టీ. కుమారీ! పనిసేయునపుడు=ఇంటిపనులుగాని, భర్తకు పరిచర్యలుగాని, సేయునపుడు, ధనవంతులసుతయైనను=భాగ్యవంతుల యింట బుట్టినను, దాసీవనితవిధంబునన్=పరిచారికవలెఁ (దాసి), మేను=వళ్లు, పంపఁగ వలయున్=వంచవలెను, దానివలన=అందుచే, ఘనతగలుగుగాదె=కీర్తివచ్చును.

తా. తానెంతటియైశ్వర్యమును పుట్టింట ననుభవించి పరిచారికలచే సేవలఁ బొందిన మగనింట దాసివలె శరీరము వంచి పనిఁజేసిన జనులు కీర్తింతురు.

క. దానములు ధర్మ కార్యము
లూనంగాఁ గలిగి నంత ♦ యుక్తక్రియలన్
మానవతుల కిది ధర్మము
గా నెరిఁగి యొనర్ప వలయుఁ ♦ గాదె కుమారీ. 80

టీ. కుమారీ! యుక్తక్రియలన్=మంచిపనులందు, దానములు=పేదలకు ధాన్యముగాని ధనముగాని యొసఁగుట, ధర్మకార్యములు=సత్రములు కట్టించుట నూతులు చెఱువులు త్రవ్వించుట మొదలగునవి, మానవతులకున్=గుణముగలిగిన కాంతలకు, ఇది, ధర్మము=న్యాయము, ఊనంగాఁ గలిగినంత=తనకుచేతనయినంతవరకు, ఒనర్పవలయుఁగాదె=చేయవలెను.

తా. దానధర్మాది సత్కార్యములెంతజేసిన నంతమేలగును స్త్రీలకం దువలన భుక్తిముక్తులు రెండునుం గలవు.

క. శ్రమ యెంత సంభవించిన
క్షమ మఱవఁగరాదు ధరణి ♦ చందంబున స
త్యమునఁ బ్రవర్తించిన యా
రమణియె లోకంబునందు ♦ రమణి కుమారీ. 81

టీ. కుమారీ! శ్రమయెంత సంభవించిన=యెంతకష్టము గలిగినను, క్షమ=ఓపిక, మరవఁగరాదు=విడువఁదగదు, (ఎట్లనఁగా) ధరణిచందంబు నన్=భూదేవియట్లు, సత్యమునన్=అబద్ధమాడకుండుటలో, ప్రవర్తించిన యారమణియె=వర్తించిన వనితయే, లోకంబునందున్=ధరణిలో, రమణి= ఆడుదిఅని చెప్పవచ్చును, లేనిచో గాడిదయని యర్థము.

తా. ఎన్నికష్టములు సంభవించినను భూదేవివలె నోపికతో, ధర్మ విరుద్ధముగా న్యాయముగా సంచరించినదే గరిత అనంబడును.

క. ఈరీతిఁ దిరుగ నేర్చిన
నారీమణి కీర్తిఁబొందు ♦ నరలోకమునం
దూఱులు తొలంగి పోవును
ఘోర దురిత సంఘమెల్లఁ ♦ గుందు కుమారీ. 82

టీ. కుమారీ! ఈరీతిన్=ఇట్లుగా, దిరుగనేర్చిన, నారీమణి=స్త్రీ, నర లోకమునన్=ధరణిపై, కీర్తిన్=గౌరవమును, పొందు, దూరులు=తిట్లు, తొలంగిపోవు=దరికిరావు, ఘోరదురితసంఘమెల్లన్=మిక్కిలి పాపముల న్నియు, కుందున్=పోవును.

తా. యింతకుమున్ను జెప్పిన ధర్మములప్రకారము నడచుకొంటివేని నిన్నెవ్వరును నిందింపఁజాలరు. మంచిపేరుకూడ వచ్చును పరమునందున సుఖము గలుగును మఱియు నీతులు చెప్పెదవినుు.

క. కామము సంకల్పంబున
బామొందెడుఁ దొలఁగు దేహ ♦ భావము దెలియన్
వేమఱు నిది బరికించుట
క్షేమంబగు ముక్తిగని సు ♦ ఖింపు కుమారీ. 83

టీ. కుమారీ ! కామము=అనురాగము, సంకల్పంబునన్=అనుకొనినంత, బామొందెడు=కలుగుచుండును, తెలియన్=ఆలోచింపఁగా, దేహభావము=దేహభ్రమచేఁదాను, తొలఁగున్=పోవును, వేమరు=అనేకమారులు, మదిన్=దీనిని నీమనస్సుచేత, పరికించు=చూచుకొనుము, క్షేమంబగున్=మేలౌను, ముక్తిఁగని=మోక్షమునంది, సుఖింపుము.

తా. కామ మను భ్రాంతి మనము పెట్టుకొనినచో వచ్చునది విరక్తి జెందినచో పోవునది గాన నీశరీర మైనను అట్టిదే గావున సుఖములం గోరక పరులకుపకారము సేయదలంచుచుండుము.

క. పరిజనము లాచరించెడి
దురితంబున క్రోధ గుణము ♦ దోఁచెడి నధిక
స్ఫురణన్ క్షమకైకొని నం
దఱుఁ నది యెఱింగి మెలఁగఁ ♦ దగును కుమారీ. 84

టీ. కుమారీ ! పరిజనములు=నీదయకై నిరీక్షించి నీవద్దనుండువారు, ఆచరించెడి దురితంబునన్=అపకారముజేసినచో, క్రోధగుణము=కోపము, తోఁచెడిన్=వచ్చును, అధికస్ఫురణన్=ఆసమయమందు ఆలోచనతో, క్షమన్=తాలిమిని, కైకొనినన్=గొనినచో, తరుగున్=(ఆయాగ్రహము) తగ్గును, అది=దానిని, ఎఱింగి, మెలంగఁదగున్=తిరుగవలయును.

తా. ఒకరు నీకపకారము చేసినప్పుడు వచ్చుకోపమును పోగొట్టుకొనుటకు శాంతమే ముఖ్యమైనది.

క. దృశ్య పదార్థము లెల్లను
నశ్యమునని తలఁచుకుండి ♦ నను లోపంబౌ
దృశ్యంబున నస్థిరత న
నవశ్యము చిత్తమునఁ దలఁప ♦ వలదె కుమారీ. 85

టీ. కుమారీ! ప్రపంచములో, దృశ్యపదార్థములెల్లను=మనకంటఁబడువస్తువేదియైనను, నశ్యములని=నశించును, అని, తలంపకుండినను, లోపంబౌ=తప్పగును, దృశ్యంబున=కనబడువాటిలో, అస్థిరత=ఉండకపోవుట, అవశ్యము=తప్పక, మనమున=మనస్సులో, తలపవలద=ఆలోచింపవలెను.

తా. మనకు గోచరించుట ప్రతివస్తువయిను సందేహములేక నశించునదియే, గావున యేవస్తువందును ప్రీతివిడచి తామరాకుపై నీటివలె సంసారమున సంచరింపవలయును.

క. జని యించెడు నజ్ఞానం
బున మోహ గుణంబు ధర్మ ♦ మున బరికింపం
దునుమాడఁబడును దీనిం
గనుఁగొని మెలఁగంగ వలయుఁ ♦ గాదె కుమారీ. 86

టీ. కుమారీ! అజ్ఞానంబునన్=జ్ఞానము లేకపోవుటవలన, మోహగుణంబు=వ్యామోహము, జనియించెడున్=కలుగును, పరికింపన్=ఆలోచింపఁగా, ధర్మమునన్=జాగ్రతిగానడచినచో, (ఆయజ్ఞానము) తను మాడఁబడున్=పోవును, దీనిన్=ఈతెరవితర్కింపను, కనుగొని=తెలిసికొని, మెలఁగఁగవలయుఁగాదె=సంచరింపవలయును.

తా. జ్ఞానములేకున్నచో మోహముపుట్టి దానివలన బుద్ధియంతయుం జెడును. అట్టిమోహముజాగ్రతచే ఛేదింపఁబడును. గావనజాగ్రతగా నడుచుకొనవలయును.

క. కులమున విత్తంబున వి
ద్యలను మదం బుద్భవించు ♦ నాయాపెంపుల్
దలపోయ మఱలు నిదిహృ
జ్జలజంబునఁ దలఁపవలయు ♦ సతము కుమారీ. 87

టీ. కుమారీ ! కులమునన్=పరువుగలకుటుంబము చేతను, విత్తంబునన్=పైకమువలనను, విద్యలన్=తెలివివలనను, మదంబు=పొగరు, ఉద్భవించున్=పుట్టును, ఆయాపెంపుల్=ధనాదులవలనియెక్కువ, తలపోయన్=తలపెట్టినచో, మఱలున్=సర్వగర్వములును వదలును, ఇది హృజ్జలజంబునన్=ఈసంగతిహృదయమునందు, తలపవలయున్=యోచించుకొనవలెను.

తా. ధనవిద్యాకులములచే గర్వమువచ్చును యీవిషయములందు తనకన్న హెచ్చుదశలోని వారిని జ్ఞప్తిఁదెచ్చుకొనినచో నాగర్వము తగ్గును కావున నాలోచించి మసలుకొనవలెను.

క. మాత్సర్య మొదవు సత్యము
హృత్సరసీజమున లేమి ♦ నెల్లప్పుడుఁ దా
సత్సేవ యందుఁ దిరిగిన
మాత్సర్య మణంగుఁ దెలిసి ♦ మనుము కుమారీ. 88

టీ కుమారీ ! హృత్సరసీజమునన్=మనంబున, సత్యము=నిజము, లేమిన్=ఉండనందువలన, మాత్సర్యము=ఎదుటివారి మేలు చూడలేకపోవుట, ఒదవున్=సంభవించును, ఎల్లప్పుడున్=ఎప్పుడును, తాన్=తాను, సత్సేవయందుఙ్=మంచివారికి పరిచర్యచేయుటలో, తిరిగినన్=సంచరించినచో, మాత్సర్యము=మత్సరము, అణంగున్=తఱుగును, ఈసంగతి తెలిసి మనము=ఎఱిఁగి బ్రతుకుము.

తా. న్యాయబుద్ధి లేనిచో పరులయెడ నసహనము గలుగును. అట్టి యసహనము సత్సాంగత్యమువలన గాని పోదు గావున సత్సాంగత్యము జేసి మాత్సర్యముం తగ్గించుకొను నుపాయ మాలోచించుకొనుము.

బహుకష్టములం బొందక
మహిలో సమకూడఁబోదు ♦ మానవజన్మం

బహూహా యీాజన్మంబున
నిహపరములఁ గొనెదుజాడ ♦ లెఱుఁగు కుమారీ. 89

టీ. కుమారీ ! బహుకష్టములఁబొందక, చాలకష్టపడినఁగాని, మహిలో=భూమిలో, సమకూడఁబోదు, మానవజన్మంబు=నరజన్మము సామాన్యముగా వచ్చునదిగాదు, అహోహో=సంతోషము, ఈజన్మంబునన్=నరజన్మయందే, ఇహపరములన్=స్వర్గలోకముయొక్కయు భూలోకముయొక్కయు సుఖములను, కొనెదుజాడ=పొందగలదా, ఎఱుగు=తెలుసుకొనుము.

తా. మానవజన్మమునకు మున్నెన్ని జన్మములెత్తితివో చెప్పజాలను నీపుణ్యవశమున నీనరజన్మముదొరికెఁ గావున నికనైన పుణ్యపాపముల నెఱిఁగి ముక్తిమార్గముం జూచుకొనుము.

క. ఎన్నాళ్లు బ్రతుకఁ బోదురు
కొన్నాళ్ళకు మరణ దశల ♦ గ్రుంగుట జగమం
దున్నట్టి వారి కందఱి
కిన్ని హితము సతము మంచి ♦ కీర్తి కుమారీ. 90

టీ. కుమారీ ! ఎన్నాళ్లు=ఎంతకాలము, బ్రతుకఁబోదురు=జీవింతురు, జగమునందున్నట్టివారికి, అందఱికి=లోకములోనుండునందఱకు, కొన్నాళ్ళకు=కొంతకాలమునకు, మరణావస్థలచేత, క్రుంగుట=నశించుట, నిహితము=విధింపబడినది, మంచికీర్తి=మంచిపేరు, సతము=శాశ్వతముగానుండును.

తా. లోకములోనుండువారందరు కొన్నాళ్ళలో చావకయుండరు దేహములు శాశ్వతములుగాదు గీర్తిమాత్రము శాశ్వతముగా నుండును.

క. పెనిమిటికన్న బతివ్రత
మునుపే మృతిఁ బొందెనేని ♦ బురుషా గమనం
బున కెదురుచూచు వచ్చిన
గనుగొని యనురాగమెనయ ♦ గలయు కుమారీ. 91

టీ. కుమారీ ! పతివ్రత=పతిభక్తిగలస్త్రీ, పెనిమిటికన్నన్=భర్తకంటె, మున్నే=ముందే, మృతిబొందెనేని=చచ్చిపోయినయెడల, పురుషాగమనంబునకున్, భర్తరాకకు, ఎదురుచూచు=ప్రతీక్షించు, వచ్చినన్=రాగానే, కనుఁగొని=చూచి, అనురాగము=ఇష్టము, ఎనయ=ఒప్పుగా, కలయన్=కూడును.

తా. పతివ్రతయైన స్త్రీ భర్తకంటె ముందు చచ్చిపోయినయెడల ఆత నిరాకకు నిరీక్షించుచుండును వచ్చినట్లయిన నాతనిఁగూడి సౌఖ్యమొందును.

క. మును నాథుఁడు తరలినచో
వెనువెంటనె పోయి యెల్ల ♦ వేల్పులు వొగడం
గని పొందు నిందు నందును
ఘనకీర్తులఁ బొందుచుండు ♦ గాదె కుమారీ. 92

టీ. కుమారీ! మును=ముందుగా, నాథుడు=భర్త, తరలినచో=గతించి నయెడల, వెనువెంటనపోయి=వెంటనేపోయి, యెల్లవేల్పులు=అందఱు దేవతులు, పొగడి=నుతింపగా, పొందు=భక్తిలోకలివిడిని, కని=పొంది,ఇందు, నందు=ఇహపరలోకమునందు, ఘనకీర్తులు=గొప్పకీర్తులను, పొందుచుండును గాదె=పొందును గాదా.

తా. భర్త ముందుగపోయినయెడ భార్య వెంటనే పోయి దేవతలు మెచ్చునట్లు కీర్తినిగాంచి రెండులోకములందును స్తోత్రము చేయఁబడును.

క. మఱవవలెఁ గీడునెన్నఁడు
మఱవంగా రాదు మేలు ♦ మర్యాదలలో
దిరుగవలె సర్వజనముల
దరి, బ్రేమ మెలంగవలయుఁ దరుణి కుమారీ. 93

టీ. కుమారీ! ధరణి=భూమియందు, తరుణి=ఆడుది, మఱవవలెఁగీఁడు =కీడు యెవరైననుచేసినచో, మరువవలయును, ఎన్నడుమరువంగారాదు, మేలు=ఎప్పుడైనను ఒకరుచేసిన యుపకారముమాత్రము మరువరాదు, దిరుగవలె=(మర్యాదలో). మంచిచెడ్డలెఱింగి జాగ్రతగాఁనడువవలెను, సర్వజనముల దరిన్=అందరివద్ద, ప్రేమ=ప్రీతితో, మెలంగవలయు=సంచరింపవలెను.

తా. ఒకరుచేసిన మేలునే మరువరాదు గాని యపకారమును మాత్రము వెంటనే మరచి యెల్లరిదరిని అనురాగముగా మర్యాద తప్పక చరించవలయును.

క. అడు లొసంగినఁ జేకొని
పోఁక నమలి నున్నమడుగఁ ♦ బోయినఁగని యీ

లోకులు నవ్వుదురు సుమీ
కైకొనవలె మంచి నడత ♦ ఘనత కుమారీ. 94

టీ. కుమారీ ! ఈలోకులు=సంసారమందుఁజిక్కినజనులు, ఆకులు=తమలపాకులు, కొన్నియుఁజేకొని=కొంచెముతీసికొని, పోకనమిలి=పోకచెక్కనమలుచు, సున్నము, అడుగఁబోయినచో, నవ్వుదురుసుమీ, కైకొనవలె, మంచినడత=దేనిచలనఁ బ్రజలాక్షేపింపరో అట్టినడత నేర్చితివేని, ఘనత=గౌరవముగానుండును.

తా. పోకచెక్క నమలుచు ఆకులు జేతనుంచుకొని సున్నమడుగఁ బోయినచో నవ్వుదురుగాన ఎట్లయిననవ్వరో ఆనడత నేర్చుకొనుము ఇది వరకే, పోకలునమలుచు నాకులుచేబూని సున్నమడిగినవాఁడు శుద్ధవెధవ అని యున్నది.

క. నేలన్ వ్రాలిన పత్రము
లోలింజోడించి మడచు ♦ చుండిన యవియున్
బోలఁగఁ సున్నపు టాకులు
దూలించు దరిద్ర దశలఁ ♦ దోఁగఁ కుమారీ. 95

టీ. కుమారీ ! నేలన్=భూమిమీద, వ్రాలినపత్రములు=ఊడిపడినయాకులు, ఓలిన్=క్రమముగా, జోడించి=మడతబెట్టి, మడచుచుండినయవియున్=ఆయాకులునుచుట్టినవియు, పోలఁగన్=అలాగునన్, సున్నపుటాకులు=సున్నమురాసినయాకులు, దరిద్రదశలఁదోఁగన్=యిడుములు పొందునట్లుగా, తూలించున్=త్రోసివేయును.

తా. నేలరాలిన ఆకులును సున్నముంచిన ఆకులను తాంబూలమునకు ఉపయోగింపవు ఒకవేళ వేసుకొన్నచో దరిద్రమని పెద్దలందురు.

క. ఇద్దఱుగూడఁగ యొకచో
నొద్దిక మాటాడుచుండ ♦ నొదిగి యొదిగి యా
రొద్దికిఁ జనఁ గూడదు తన
పెద్దతనంబెల్ల నణఁగఁ ♦ బెట్టు కుమారీ. 96

టీ. కుమారీ! ఇద్దరు, ఒకచోటన్=ఒక్కస్థలమునందు, కూడుకన్=కలుసుకొని, ఒద్దికన్=జతగా, మాటాడుచుండగన్=మాట్లాడుకొనుచుండఁగా, నొదిగి, యొదిగి=మెల్ల మెల్లఁగా, ఆయొద్దకున్=అక్కడికి, చనఁకూడదు, వెళ్ళదగదు, (అట్లేగినచో) తన పెద్దతనం బెల్లన్=నీగొప్పయంతయు, అణంగం బెట్టుతగదు.

తా. యిరువురెవ్వరైనను రహస్యములు మాట్లాడునప్పుడు మెల్లఁగా నామాటలువినుటకు పోయితివేని యసహ్యపడి నీగౌరవమును వారు చెందనాడుదురు.

క. తుదుపుదుమారమ్మును జెరు
గుదు ధూళియు మేష రజముఁ ♦ గూడ దెపుడు మై
బడనెఱిగి తిరుగ నేర్చిన
బడతుక మర్యాద లెఱిఁగి ♦ బ్రతుకు కుమారీ. 97

టీ. కుమారీ! దుదుపుదుమారమ్మను=తుడిచినప్పుడు వచ్చెడుధూళిని, జెరుగుడుదూళియు=చెరుగునప్పుడు వచ్చుదుమ్మును, మేషరజము=మేక నడుచునప్పుడు రేగినధూళిని, ఎపుడున్=ఎప్పుడును, మైన్=శరీరమున, పడన్=పడకుండ, ఎఱిఁగి=తెలుసుకొని, తిరుగనేర్చిన=నడుచుట తెలిసినచో, పడతుక=వనిత, మర్యాదలెఱిగి బ్రతుకు=సర్వము తెలుసుకొనఁగల శక్తిగలదగును.

తా. మేకకాళ్ళధూళియు తుడుపుధూళియు చెరుగునప్పుడు రేగుధూళియు తనపైఁ బడకుండ కాపాడుకొను స్త్రీ జాగ్రతగలదగును.

క. దీపముల నీడమానవ
రూపంబులనీడ శనితరుల ♦ నీడ సుఖ
ట్వాపాదితమగు నీడల
నేపట్టున నిలుఁవగూడ ♦ దెపుడు కుమారీ. 98

టీ. కుమారీ! దీపము నీడలన్=దీపమునకుచాటున (కీనీడయందును) మానవరూపంబులనీడన్=మనిషినీడచాటున, శనితరులనీడన్=తాడిచెట్లనీడను, సుఖట్వాపాదితమగునీడలన్=మంచపునీడను, ఏపట్టునన్=ఎప్పుడైనను, నిలువబడఁగూడదు.

తా. దీపపుమంచపునీడలందు గాని తాడిచెట్టుమనిషినీడలందు గాని నిలువరాదు.

క. కొనగోట వ్రేలు వెండ్రుక
లను జారెడునీళ్లకుండ ♦ లను ముంతల వా
డిన వెన్క మిగులు నీళ్లును
జనదండ్రు దరిద్రమొందు ♦ జగతి కుమారీ. 99

టీ. కుమారీ ! కొనగోళ్ళన్=గోళ్ళచివర, వ్రేలువెండ్రుకలను=విప్పిన వెండ్రుకలందును, జారెడునీళ్ళు=వుండి పడునీళ్ళు, కుండలన్=కడవల లో, ముంతలన్=పిడతలలో, వాడినవెన్కన్=అడుగునీళ్ళు, చనదండ్రు= వాడరాదందురు, (అట్లుచేసినచో) దరిద్రమొందుఁ (జగతి)=(భువిపై) దరిద్రమువచ్చును.

తా. కొనగోటినీళ్లు తలవెంట్రుకలనుండి పడిననీళ్ళు శరీరముమీదగాని నట్టింటఁగాని పడఁగూడదు కుండయడుగునీళ్లు వాడరాదు,

క. ధర బక్కికులుడు వేంకట
నరసింహ కవీంద్రుఁడిట్టి ♦ నడతలు ధరపైఁ
దెలివల తెరవులటంచును
జిరతర సత్కీర్తి వెలయుఁ ♦ జెప్పె కుమారీ. 100

టీ. కుమారీ ! ధరన్=ప్రపంచమున, బక్కికులుఁడు=పక్కివారియింట బుట్టినఁ (యింటిపేరు పక్కివారు) వేంకటనరసింహకవీంద్రుఁడు, ఇట్టినడ తలు ధరణిపై=లోకమున మంచినడవడి, దెరవల తెరవులటంచును=ఆడ వాండ్రకు మంచిమార్గములని, చిరకీర్తి=శాశ్వతమైనకీర్తి, వెలయన్=ప్ర కాశించునట్లుగా, చెప్పె=రచించెను.

తా. పక్కి వెంకటనరసింహకవి తనకు శాశ్వతకీర్తి కలుగఁగోరియు ౹ల యుపయోగములకొఱకును నీతిప్రదముగా నీశతకముఁ జెప్పెను.

సమాప్తము.

# మిలటరీపాకశాస్త్రము

ఇందు మాంసము, పులావు, కుర్మా, మాంసముతో అనేకరకములుగ కూరలు చేయుట, కోడిగ్రుడ్డుతో పలువిధములుగ తయారు చేయువిధము చేపతో అనేకరకములు కూరలు చేయుట పచ్చిరొయ్యలు, గారెలు వొండుట ఇంకా ఈరొయ్యలతో అనేక రకములు కూరలు వండుట సుమారు 200 పయిన కూరలు చేయువిధము అంతయు వ్రాయబడినది. వెల 1—0—0

# దస్తావేజులమతలబి

ఇందు ఇల్లుక్రియం భూమిక్రియం మనువర్తియిచ్చేపద్ధతిని క్రియం, భూమితనఖా, పంచాయితీ తీర్పులు, పిరాయింపుదస్తావేజులు, జామీను పత్రములు, డిక్రీట్రాన్సుఫరు, ప్యారీకత్తు మరణశాసన, విల్లుదస్తావేజులు, దత్తతఅధికారపత్రిక, దానపత్రము, మనోవర్తి, దస్తావేజులు, కవులుకదపాలు, కండగుత్తకవులు, అద్దెచీటి, హక్కువిడుదల దస్తావేజు, గోడహక్కును గూర్చి సందుహక్కునుగూర్చి, మనోవర్తి హక్కునుగూర్చి ఇల్లుక్రియము, రద్దుదత్తత, రద్దువివాహవిమోచన, యెగ్రిమెంట్లునుగూర్చి నవుకరీగూర్చి, సరుకు సప్లయినిగూర్చి, తాకట్టుపత్రము, ప్రోనోట్లు, ప్రోనోట్లుట్రాన్సుఫరు, పవరు ఆఫ్‌టర్నీలు, షారీవ్యాపారపు దస్తావేజులు, రసీదులు, తనఖాదస్తావేజు ఈయన్ని విషయములు వ్రాసుకొనుపద్ధతులు ఇందు వ్రాయబడినవి. వెల 0—12—0

# మహాపతివ్రతలకథలు

ఇందు సుకన్య, దమయంతి, సావిత్రి, చంద్రమతీ, పద్మావతీ, గాంధారి, కుంతీ, సునీతి, రుక్మిణీ, అరుంధతీ, సరసాదేవి, సంధ్యావళీ, ద్రౌపతీ, శకుంతల, సీతాదేవి, అనసూయ, సుమతీ, నాలాయినీ, ఊర్మిళ, లోపాముద్ర, జయప్రదమున్నగు పతివ్రతాశిరోమణుల కథలు 21 గలవు. 160 పేజీలు. ప్రతిస్త్రీ చదువదగినది వెల 1—0—0.

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి.